# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 43. సంచిక 21 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 22-4-1956 Reg. No. M. 5745. 10 పేజీలు 2 అణాలు

# 'ఆంధ్ర హైకోర్టును పూర్తిగా హైదరాబాదులోనే నెలకొల్పాలి'

## మా అట్లాంటిక్ మండలి మా వార్సా మండలి

### ఇలా కోడిపుంజుల్లాగా పోట్లాడ వలసిందేనా అని కృష్చేవ్ ప్రశ్న

లండన్, ఏప్రిల్ 20: "మీరు ఉత్తర అట్లాంటిక్ మండలములోను, మేము వార్సా మండలములోను చేరి కోడి పుంజుల్లాగా పోట్లాడుకోవడం లోకానికి మేలు జరగదు. ప్రజలకు మేలు జరగదు. అందరికీ మేలు జరగాలంటే ఒక్కటే మార్గం వుంది. అది యుద్ధసంకల్పాలనే విరమించుకొనడం; సైన్యాలను ముందు తగ్గించి, తర్వాత పూర్తిగా రద్దుచేయడం" అని రష్యా కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ కృష్చేవ్ నేడు బ్రిటిష్ ప్రధానోద్యోగులు తనకు, శ్రీ బుల్గానిన్‌కు చేసిన విందుసందర్భంలో మాట్లాడుతూ అన్నారు.

శ్రీ కృష్చేవ్ తాము లండన్ ఏందుకువచ్చింది వివరించుచూ ఇలా అన్నారు: మీకూ మాకూ లావాదేవీలు ఏమీ లేవు. అందువల్ల సమాన ధోరణులో, అరమరికలు లేకుండా మాట్లాడుకోవడం వీలవుతుంది. యుద్ధ కాలంలో మీరూ మేమూ కలిసి పని చేశాము. తర్వాత ఆ సంబంధాలు తెగిపోయాయి. వాటిని తిరిగి సాధించుకోడానికి, అంకుకువున్న అవరోధాలను తొలగించుకోడానికి, నిజమైన సహవాసాన్ని ఏర్పాటు చేసుకోవడానికి ...

ఇట్లాగే నిన్న జరిగిన సమావేశంలో వీరు సాంస్కృతిక సంబంధాలను యూరప్ సమస్యలను చర్చించారు.

రష్యా నాయకుల పర్యటనం వల్ల ప్రపంచంలో ఉద్రేక స్థితులు తగ్గే అవకాశం వున్నదని, రష్యా, బ్రిటన్ల మధ్య వర్తక వ్యాపారాలను ఎక్కువ చేసుకోవడం అవసరమని, మాస్కో రేడియో ప్రకటించింది. రష్యా, బ్రిటను కలిసినట్లయితే యూరప్‌లో భద్రత వుంటుంది. ...

ఎవ్వరికీ లాభం లేదు

ప్రజల సంబంధాలు అవసరం

తగుప్రతిపాదనల తయారీ

## భారత ప్రభుత్వానికి ప్రదేశ కాంగ్రెసు సర్వసభ్యసభ విజ్ఞప్తి

### ఫజులాలీసంఘ సిఫార్సు ప్రకారమే బళ్లారి సమస్యను పునఃపరిశీలించాలని అభ్యర్థన

(ఆంధ్రపత్రిక విలేఖరి)

విశాఖపట్టణం, ఏప్రిల్ 21: ఆంధ్రప్రదేశ్ హైకోర్టు హైదరాబాదులోనే ఉండాలని, విడిగా హైకోర్టు శాఖ అంటూ ఎక్కడా ఉండకూడదని, భారతప్రభుత్వానికి, భారత పార్లమెంటుకు ఆంధ్రప్రదేశ కాంగ్రెసు సర్వసభ్య మహాసభ విజ్ఞప్తి చేసింది.

తుంగభద్ర ప్రాజెక్టును సరిగా నిర్వహించేందుకు, క్షామప్రాంతమైన రాయలసీమకు ఉపకరించే, తుంగభద్ర మెరక కాల్వను త్రవ్వకొనేందుకు, ఫజులాలీసంఘం సిఫార్సు చేసినప్రకారం బళ్లారి జిల్లాలోని బళ్లారి, హొస్పేట సిరిగుప్ప తాలూకాలను, మల్లాపురం సబ్ తాలూకాను వెంటనే ఆంధ్రప్రదేశ్‌కు మార్చే విషయంపునఃపరిశీలించాలని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

ప్రదేశ కాంగ్రెసు సర్వసభ్య సమావేశం నిన్న సాయంత్రం శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు అధ్యక్షతన పునర్నిర్మాణం విషయంలో ఫజులాలీసంఘ కాంగ్రెసు అధిష్ఠానవర్గం చేసిన సిఫార్సులపై ఆంధ్ర హైదరాబాదు శాసనసభలు ఆమోదించిన తీర్మానాలనే అట్టే తేడా ...

2 వ పేజీ 4 వ కాలం చూడుడు

## ఇండొనీషియా స్వాతంత్ర్యం

### భారత సహాయానికి సోకర్నో కృతజ్ఞత

## కర్నూలు జిల్లాలో 6 హైస్కూళ్ల మూసివేత

### విరాళాలు యివ్వనందువల్ల: ఉపాధ్యాయుల తీసివేత

కర్నూలు, ఏప్రిల్ 21 : వాగ్దానం ప్రకారం దాతలు విరాళాలు యివ్వనందున, యీ జిల్లాలో, ఆరు ఉన్నత పాఠశాలలను మూసివేయవలసిందిగా ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. ఈ పాఠశాలలు రాజుపాలెం, నొస్సాం, అర్ధవీడు, గూడూరు తుగ్గలి, ఎర్రగొండపాళెం గ్రామాలలోనివి.

వీటిని మూసివేయడంవల్ల, సుమారు 100 మంది సెకండరీగ్రేడు ఉపాధ్యాయులు—వీరి చాలామంది వ్యాయామ శిక్షణ యిచ్చేవారు — పదవులనుంచి తొలగింపబడడమో లేక ప్రాథమిక పాఠశాలలలో నియమింపబడడమో జరిగింది. ఇలా ప్రాథమిక పాఠశాలలో నియమింపబడిన ఉపాధ్యాయులకు, హైస్కూళ్లలో ఉండగా పుచ్చుకొన్న జీతంలో సగం జీతం మాత్రమే యిక ముట్టుతుంది.

మార్కాపురం, కంభం, ఆత్మకూరు, వెలుగోడు, బంగినపల్లి, ఎమ్మిగనూరులలో ఉన్న హైస్కూళ్లలోనివి—ఉరుదు, సంస్కృతం, కన్నడ సెక్షన్లను—విద్యార్థులు తగినంతమంది లేనందువల్ల — ఎత్తివేయాలని కూడా ఉత్తరువులు జారీ అయినవి.

### ఉపాధ్యాయుల తీసివేత

కొంతమంది ఎల్. టి. ఉపాధ్యాయులనుకూడా తీసివేశారు. ముఖ్యంగా ఉత్తర ప్రత్యుత్తరాల అలక్ష్యంవల్ల ప్రాజెక్టు ప్రారంభం కాలేదన్న కారణంతో వారిని తీసివేయడం జరిగినట్లు తెలిసింది. తొలగించిన ఉపాధ్యాయులలో కొందరు ఏడేళ్ల అనుభవం గడించినవారుకూడా ఉన్నారట.

మరో ఆరు హైస్కూళ్లలో —

## శ్రీ నెహ్రూకు ఫ్రాన్సు ఆహ్వానం

### జులై 17 న యూరపుకు ప్రయాణం

పారిస్, ఏప్రిల్ 20: ఫ్రెంచి విదేశాంగమంత్రి యమ్. క్రిస్టియన్ పినే ఆహ్వానాన్ని పురస్కరించుకొని, భారతప్రధాని శ్రీ నెహ్రూ జులై 17-న పారిస్‌కు వస్తారు.

పారిస్‌లో భారతరాయబారి సర్దార్ హెచ్. యస్. మాలిక్, శ్రీ పినేను ...

## శ్రీ ఫజల్ ఆలీ

### అస్సాం గవర్నరుగా నియామకం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ ఫజల్ ఆలీని అస్సాం గవర్నర్‌గా శ్రీ జైరాందాస్ దౌలత్‌రామ్ స్థానంలో నియమించారు.

శ్రీ ఫజల్ అలీ వచ్చే నెల 15 ప్రాంతంలో ఉద్యోగంలో ప్రవేశిస్తారు.

### ముఖ్యమంత్రికి 4 వారాలు విశ్రాంతి

విశాఖపట్టణం, ఏప్రిల్ 20: నాలుగు వారాలు పూర్తి విశ్రాంతి తీసుకోమని ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి వైద్యనిపుణులు సలహా చెప్పారు. ముఖ్యమంత్రి కింగ్ జార్జి ఆసుపత్రిలో చేరారు.

ప్రణాళికల శాఖ మంత్రి శ్రీ కళా వెంకటరావు కింగ్ జార్జి ఆసుపత్రినుంచి విడుదలై అమలాపురం వెళ్లారు.

ప్రస్తుత సంవత్సరంలో దేశంలో 84000 అంబర్ చరఖాలను తయారు చేసి వాడకంలో వుంచాలని సర్వ సేవా సంఘం నిశ్చయించింది.

## ఎన్నికలను వాయిదా వేయించాలని యత్నం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 19 : దేశం మొత్తంమీద జరగవలసిన ఎన్నికలను వాయిదా వేయించడానికి కొందరు కృషి చేస్తున్నారు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ మూలంగా ఎన్నికలను వాయిదా వేయడం ముఖ్యమని వీరు చెబుతున్నారు.

ఉత్తరప్రదేశ్‌లో కిందటివారంలో జరిగిన ఉపఎన్నికలలో కాంగ్రెసుకు సంప్రాప్తించిన పరాజయం, ఎన్నికలను వాయిదా వెయ్యాలనడానికి ఊతగా ఉపయోగించడానికి కొందరు పూనుకున్నారు. 1956-57 లో దేశవ్యాప్తంగా ఎన్నికలు జరిగితే మహారాష్ట్రం, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్, బీహార్, రాజస్థాన్, పంజాబ్‌లలో కాంగ్రెసు చాలా స్థానాలను పోగొట్టుకోవలసివస్తుందని వీరివాదం.

వచ్చే శీతకాలంలో ఎన్నికలు జరగాలని అభిలషిస్తున్న ప్రధాని శ్రీ నెహ్రూపై కొందరు చేస్తున్న తిరుగుబాటు పర్యవసానమే ఎన్నికలను వాయిదా వెయ్యాలనే వాదన స్వరూపమున్న అభిప్రాయమొకటి కనిపించుతున్నది.

ఎన్నికలను ఒక సంవత్సరం వాయిదా వేస్తే ప్రభుత్వ చర్యల సత్ఫలితాలు సుస్పష్టమవుతాయనీ, కాంగ్రెసు తన అధికారాన్ని నిలబెట్టుకునే అవకాశాలు ఎక్కువవుతాయని వీరికి ఒక నమ్మకం ఏర్పడినట్లు విదితమవుతున్నది.

ఏమైనా ఎన్నికలను ఇప్పుడు అనుకున్నట్లు జరిపించక మరో సంవత్సరం వాయిదా వేస్తే వచ్చేఏటితో ప్రారంభించే రెండవ పంచవర్ష ప్రణాళిక, పేరున ఎన్నికల్లో కాంగ్రెసుకు కలిగే ప్రయోజనాలన్నీ వమ్మైపోగలవనేది మాత్రం ఖాయం.

రెండవ పంచవర్ష ప్రణాళికే దాదాపు కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక.

ఎన్నికలను వాయిదా వేయించాలనే ప్రచారం కాంగ్రెసు పార్టీలోనే ప్రారంభమైంది. ఈ ప్రచారం ప్రధాన మంత్రి అభిలాషను త్రోసిపుచ్చగలిగినా త్రోసిపుచ్చవచ్చు.

## స్థానికాభివృద్ధి పనులకు కంట్రాక్టర్లు వద్దు

### గ్రామస్థులచేతనే చేయించాలని చిత్తూరు జిల్లా కాంగ్రెసు విజ్ఞప్తి

చిత్తూరు, ఏప్రిల్ 16 : స్థానికాభివృద్ధి పనుల నమలు జరిపించే సందర్భంలో పనులను ఇతర కంట్రాక్టరులకు ఇచ్చే బదులు ఆయా గ్రామాలలోని ప్రజలకే ఇప్పించే ఏర్పాటు చేయించమని ప్రభుత్వాన్ని కోరుతూ నిన్న జరిగిన చిత్తూరు జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో తీర్మానించారు.

## పంచాయతీ ఎన్నికలు

### కాంగ్రెసువారు పాల్గొన రాదని ఉత్తర్వు



లెబనాన్‌లో ఈమధ్య వచ్చిన భూకంపం మూలంగా చాలా నష్టం కలిగింది. బాధితులకు భారత ప్రభుత్వం మందులు, ఉన్నివస్త్రాలు, గుడ్డలు, డేరాలు ప్రత్యేక విమానాల్లో పంపింది. బైరూత్ విమానాశ్రయంలో మొదటివిమానంనుంచి సామగ్రిని దించుకుంటున్నారు.

## ఆరు జిల్లాబోర్డులకు సలహా సంఘాలు

### శ్రీకాకుళం, ప. గోదావరి, కృష్ణా, నెల్లూరు, కడప, అనంతపురాల్లో ఏర్పర్చాలని ఉత్తర్వు

కర్నూలు, ఏప్రిల్ 21 : ఆరు జిల్లాబోర్డుల స్పెషల్ ఆఫీసర్లకు, సలహా సంఘాలను యేర్పాటుచేసే విషయం ఖరారైంది. కొద్ది రోజులలోనే ఉత్తర్వులు జారీచేస్తారు. ఆ ఆరుజిల్లాలు యివి: శ్రీకాకుళం, కృష్ణా, పశ్చిమ గోదావరి, నెల్లూరు, కడప, అనంతపురం.

యుగోస్లేవియా పర్యటన

# ఉపాధ్యాయుల కష్టసుఖాలు

## ముఖ్యమంత్రికే చెప్పాలని సలహా

### ఉపముఖ్యమంత్రి ప్రసంగం

నరసాపురం, ఏప్రిల్ 19: విద్యా, ఆర్థిక శాఖలను కూడా ముఖ్యమంత్రే నిర్వహిస్తున్నారు గనుక ఉపాధ్యాయులు తమ కష్టసుఖాలను వారికి తెలియజేయడంలో కష్టమేమీ వుండదని భావిస్తున్నానని ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి నిన్న తాలూకా ప్రాథమికోపాధ్యాయ మహాసభను ప్రారంభిస్తూ అన్నారు.

శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు అధ్యక్షత వహించారు. ప్రాథమికోపాధ్యాయులు వినతి పత్రాన్ని ఉపముఖ్యమంత్రికి సమర్పిస్తూ అన్ని జిల్లాలలోను ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వమే నిర్వహించాలని ఉపాధ్యాయుల పదవీ విరమణ వయస్సు 60 కి పెంచాలనీ కోరారు.

శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు ప్రసంగిస్తూ ప్రాథమికోపాధ్యాయుల వృత్తి, జీతాలవిషయంలో కేంద్రప్రభుత్వం శ్రద్ధ వహించగలదని పేర్కొన్నారు. రాష్ట్ర బడ్జెట్ లో టు బడ్జెట్ అన్న సంగతి గుర్తించాలని కోరారు. ప్రజలపై అదనపు పన్నులను విధించవలసి వుంటుందని సూచించారు. కాని ప్రజలు అంగీకరిస్తున్నట్లు తమకు తోచడం లేదన్నారు.

శ్రీ సంజీవరెడ్డి గత మంత్రి వర్గంలో రాష్ట్రానికి చేసిన సేవను ప్రశంసిస్తూ యీ నియోజక వర్గశాసన సభ్యుడు శ్రీ రెడ్డి నాయుడు చిత్రపటం ఆవిష్కరించాలని కోరారు.

శ్రీ సంజీవరెడ్డి వారి చిత్రపటం ఆవిష్కరిస్తూ రెడ్డి నాయుడు గారి ప్రతిభావిశేషాల నుగ్గడించారు. ఇట్టివారు కాంగ్రెసుకు ఎంతయినా అవసరమన్నారు. ఉపాధ్యాయుల విషయమై కేంద్రం శ్రద్ధతీసుకుంటుందని హామీ యిస్తూ యిలా అన్నారు:

"కేంద్రంనుంచి ఉపకారం జరుగుతుంది. కాని, రాష్ట్రప్రభుత్వం, అంగీకరిస్తుందా అని మీరు అనుమానపడటంలో ఆశ్చర్యంలేదు. రాష్ట్రప్రభుత్వం కూడా మీ పట్ల సుముఖంగానే వుండివుంటుందని భావిస్తాను."

"ఉపాధ్యాయుల బాధ్యత లెక్కువ. వారి యిబ్బందులను విద్యామంత్రికి తెలియజేసుకోవాలి. మనకు విద్యామంత్రి, ఆర్థికమంత్రి, ముఖ్యమంత్రి కూడా ఒకరే! కాబట్టి వారికి మీ యిబ్బందులు చెప్పుకోవడంలో కష్టమేమీవుండదని అనుకుంటాను."

"ఉపాధ్యాయ సంఘ నివేదికను 100 పాళ్ళు ప్రభుత్వం అంగీకరించదు. అసలు ఆ సంఘాన్ని నియమించడం పొరపాటయిందేమో అనుకుంటాను"

తరువాత కళాశాల ఆవరణలో జరిగిన సభకు శ్రీ అల్లూరి బాపినీడు అధ్యక్షత వహించారు. శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు చిత్రపటాన్ని శ్రీ సంజీవరెడ్డి ఆవిష్కరిస్తూ తమ యిద్దరికీ యింతవరకు అభిప్రాయభేదాలు రాకపోవటం తమకే ఆశ్చర్యంగా వున్నదన్నారు. విశాలాంధ్ర సాధనకు వారి కృషిని ప్రశంసించారు. కళాశాల భవనం చాలా ఆకర్షణీయంగా వున్నందుకు, పాలక వర్గాన్ని అభినందించారు. నూతన పద్ధతులపై కళాశాలాభివృద్ధికి కృషి జరగాలని కోరారు.

శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తి వందన మర్పించారు.

రాత్రి గాంధీ బజారులో బహిరంగ సభ జరిగింది. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు.

## వ్యామోహం హెచ్చింది

శ్రీ సంజీవరెడ్డికి శ్రీ సత్యనారాయణ రాజుకి శ్రీపరకాల శేషావతారం సన్మానపత్రాలు సమర్పించారు.

శ్రీ ప్రకాశం మంత్రివర్గం వున్నప్పుడు శ్రీ సంజీవరెడ్డి చేసిన కృషిని గురించి శ్రీ రాజు వివరించారు. విశాలాంధ్ర సాధనలో నాయకుల కృషిని శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రశంసించారు. శ్రీ సంజీవరెడ్డి మాట్లాడుతూ యిలా అన్నారు:

"ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు జరుపుకుంటున్నాం. విధులు లేనంత మాత్రాన పీటిని ఆపుచేయరాదు. నవ మంత్రివర్గం అప్పుడూడాచేసి ఎన్నో పనులు ప్రారంభించింది. ప్రత్యేక రాష్ట్రం వచ్చాక ఆంధ్రులకు ఎక్కువ పురోగ్యాలొచ్చినమాట నిజమే. పదవీ వ్యామోహం కూడా ఎక్కువయింది. అది కూడా గుర్తించాలి. అభివృద్ధి కార్యక్రమాలన్నీ ప్రజలకే. వారందులో భాగస్వాములే. ధరలు పెరిగితే ప్రజలు యిబ్బందిపడతారు. తగ్గితే రైతులు నష్టపడతారు. కనుక ప్రభుత్వం రెంటినీ సమన్వయపరచవలసి వుంటుంది. మనది చాలా ఉజ్వలమైన చరిత్ర; ఈనాడు పేదరికం కొంపదీస్తోంది. బాగార్జునుని స్థలాన్ని తిరిగి సస్యశ్యామలం చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది. శ్రీ స్వాహా నాయకత్వదేశం పురోగమించగలదు. దేశం బంగారుసీమ కాగలదు."

# మొక్కల తెగుళ్ల అదుపు

## ధనం మంజూరు

కర్నూలు, ఏప్రిల్ 20: కూరగాయల పాదులకు, మొక్కలకు, సంభవించే తెగుళ్ళను గురించి తగు పరిశీలనలు జరుపవలసిందిగా ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. వచ్చే రెండేళ్లలోను తెగుళ్లు నివారణ చర్యలకు రు 34932 మంజూరు చేసింది.

## విద్యావిషయిక ఖర్చు

జిల్లాబోర్డుల పురపాలక సంఘాల విద్యావిషయిక అసాధారణ ఖర్చుకు ప్రభుత్వం పరిమితి నిర్ణయించింది. స్కూళ్ళ డివిజనల్ ఇన్ స్పెక్టర్ అయితే రూ 200 మించకుండానూ, విద్యాశాఖ డైరెక్టరైతే రు 500 దాటి ఖర్చు మంజూరు చేయవచ్చు.

## టీకాలు వేసేందుకు నిబంధనలు

పిల్లల ఆరోగ్యానికి భంగం కలిగించగలవన్న విషయాన్ని ఏ మేజిస్ట్రేటు అయినా ధృవపరచే పక్షంలో అట్టి పిల్లలకు మాత్రం పురపాలక, జిల్లా బోర్డుల ప్రాంతాలలో, టీకాలు వేయనవసరంలేదని ప్రభుత్వం నిబంధనలను సవరించింది. పెద్ద వాళ్ళకి కూడా యిది వర్తిస్తుంది. ప్రభుత్వం ప్రత్యేకంగా అధికారాలు ప్రసాదించిన మేజిస్ట్రేటు ఎదుట మాత్రమే పాతుకమిచ్చి ధృవపత్రం తీసుకోవాలి. ఎంతకాలంవరకు యీ సౌకర్యం అనుభవించవచ్చునో కూడా అందులో తెలుపుతారు. హామీని వుల్లంఘించిన వ్యక్తిని మూడు నెలలవరకు ఖైదుకు పంపవచ్చు, లేదా జరిమానా విధిస్తారు.

## వేలిముద్రలశాఖ డైరెక్టరు

వేలిముద్రల కార్యాలయ సూపరింటెండెంటు హోదాను డైరెక్టరు హోదాకు (అనంతపురం) ప్రభుత్వం మార్పుచేసింది.

## వైద్య మండలి

ఆంధ్ర రాష్ట్రానికి 7 గురు సభ్యులతో ఒక వైద్యమండలిని ఏర్పాటు చేయాలని వుద్దేశిస్తున్నారు. ఇందులో ఒకరిని ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ ఎన్నుకుంటుంది.

(ఫేకల్టీ ఆఫ్ మెడిసిన్ నుంచి) ఆంధ్ర వైద్య కళాశాల అధ్యాపక వర్గం నుంచి (విశాఖ) గుంటూరు వైద్య కళాశాల నుంచి ఒకొక్కరువుంటారు. ముగ్గురిని రిజిస్టర్డు ప్రాక్టీషనర్లు ఎన్నుకుంటారు. ప్రభుత్వం ఒకరిని నియమిస్తుంది.

## క్రొత్త పంచాయతీలు

రాష్ట్రంలో మరో 30 పంచాయితీలను ప్రభుత్వం ఏర్పాటుచేస్తూ ఆదేశించింది.

## కర్నూలు జిల్లా

మారాజుపల్లె, ఆవపూరు, గుంటవాల, తమ్మడపల్లె, కొట్టాల, భోజనం, గోటుపల్లె, తిమ్మాపురం, వెంకటమాపల్లె, చుండ్రెగోడి, తిప్పనూరు, కపరాళ్ళ, చిన పెంచికల్లు, కందమకుంట్ల, శెక్కెకల్లు, ఇంగులపాళ్లు, మూసనపల్లి, గుమియూరాయదిన్నె, కమూాపల్లె, జేవకుంట్ల, సిరివెళ్ల, పెద్ద బోదనం గంగవరం.

## గుంటూరుజిల్లా

అయ్యవారిపాలెం, పసుమేముల కొండమూరు, గొండ్లపాడు, వెలుట్ల, చింగప్ప.

## శ్రీకాకుళంజిల్లా

కొత్తపల్లి, వేదాంతం, తాళ్లభద్రం.

## చిత్తూరు జిల్లా

అముదూరు, పెద్ద కందుకూర్తి.

## నెల్లూరు జిల్లా

కల్లంపల్లి.

## కర్నూలులో అగ్ని ప్రమాదం

కర్నూలు, ఏప్రిల్ 18: బంగారుపేటలో యీ ఉదయం జరిగిన అగ్ని ప్రమాదంలో మూడు పాకలు తగులబడి పోయినవి. సుమారు రు 200 ఆస్తి నష్టమైనది. శ్రీ వి. సుబ్రహ్మణ్యం అధ్వర్యాన అగ్నిమాపకదళం మంటలను ఆర్పింది.

## అగ్ని బాధితులకు సహాయం

బందరు, ఏప్రిల్ 17: పోడా, బీడివర్తక సంఘ సభ్యులు నిన్న సబూజేశమై సుల్తానాబాద్ లో జరిగిన అగ్ని ప్రమాదంలో నష్టపడినవారికి రు 2000 కలప కొని యివ్వాలని తీర్మానించారు. ఆహార పదార్థాల ధరలు పెరిగిపోతున్నందున పౌకడిపోలు ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరారు.

## గుంటూరు తాలూకాలో పంచాయతీ ఎన్నికలు

మంగళగిరి, ఏప్రిల్ 17: గుంటూరు తాలూకాలో, ఈ దిగువ గ్రామాలకు ఆయా తేదీలలో ఎన్నికలు జరుగుతవి:

చినకాకాని—26-4-56; కాజ—27-4-56; పెదకూడి-28-4-56; వెంకటపాలెం—25-4-56; చినపలకలూడి—27-4-56; నూతక్కి—29-4-56; రామచంద్రపురం—30-4-56.

అమెరికా నుంచి 25 టన్నుల 'బరువు నీరు'—అణుశక్తి పరిశోధన కోసం—కొనడానికి ఒప్పందం కుదుర్చుకున్నారు. భారతదేశం తరపున డా॥ హోమీ జె. భాభా, అమెరికా తరపున అడ్మిరల్ స్ట్రాస్ సంతకాలు చేశారు. వెనక నిలచినవారు అమెరికాలో భారతరాయబారి శ్రీ జి. యల్. మెహతా.

మద్రాసు సమాజ సేవాకార్యకర్తల శిక్షణశాల స్నాతకోపన్యాసం ఏప్రిల్ 17 వ డా॥ సి. పి. రామస్వామి అయ్యర్ ఇచ్చారు. 18 మంది శిక్షితులకు యోగ్యతాపత్రాలు ఇచ్చారు.

# ముళ్లపాడు వద్ద ప్రమాదం

## లారీక్రిందపడి ఒకని మరణం

వంద్రగాము, ఏప్రిల్ 19: షేక్ మహమ్మద్ పేటనుంచి ఇనుపరాయి వేసుకొని బెజవాడ వైపు వెళుతున్న లారీ ఒకటి ముళ్లపాడు అడ్డరోడ్డు సమీపంలో లంబాడి మనిషి మీదుగా పోవడం చేత, తక్షణం అతను మరణించాడు.

ఈ సంఘటన నిన్న రాత్రి 8 గంటలకు జరిగింది. అతను బండి మనిషి అని, ప్రక్కన నడుస్తూ బండి తోలుతుండగా యీ ప్రమాదానికి గురియైనాడని తెలిసింది. శవాన్ని, యిక్కడి ఆస్పత్రికి తీసుకొనివచ్చారు.

## బళ్లారి లోక్ సహాయక్ సేన

బళ్లారి, ఏప్రిల్ 17: లోక్ సహాయక్ సేన శిక్షణశిబిరానికి వరుగోడువద్ద శ్రీ శ. శేషగిరిరావు నిన్న ప్రారంభించారు. కెప్టెన్ శ్రీ ఎలిరాజ్ స్వాగతమిచ్చారు. శిక్షణ వివరాలను తెలిపారు. శిక్షణపొందడానికి ఎక్కువమందికి అవకాశం కలిగించలేక పోయినందుకు విచారం వెల్లడించారు. రెవెన్యూ, పోలీసు, అధికారులను, శ్రీ నూతి బసన్నగౌడకు వారిచ్చిన సహకారానికి అభినందనలు చెప్పారు.

ఐకమత్యంతో యువజనులంతా యిలాటి శిక్షణవల్ల కలిగే ప్రయోజనాలను పొందాలని శ్రీ శేషగిరిరావు కోరారు. గ్రామాల్లో రోడ్ల నిర్మాణానికి కృషిచేయాలని సూచించారు.

## గుంతకల్లులో పేదవారి ఇంటి వసతి స్థితి

గుంతకల్లు, ఏప్రిల్ 18: పట్టణంలో గుడిసెలలో నివసిస్తున్న పేద హరిజనులకు, యితర వెనుకబడిన జాతులవారి ఇళ్ళపట్టాలు మంజూరు చేయాలని మంత్రి శ్రీ నీలంసంజీవరెడ్డికి యిటీవల శాసనసభ్యులు శ్రీ యం. రామారాం, పెంచికొట్టాల హరిజన సంఘం, భారతసేవక సమాజం విజ్ఞప్తి చేశాయి.

తగు శ్రద్ధ తీసుకుంటామని మంత్రి హామీ యిచ్చారు.

# కల్లూరులో ఆరోగ్యకేంద్రం

## ప్రారంభోత్సవం

ప్రొద్దుటూరు, ఏప్రిల్ 19: సమాజ వికాస ప్రణాళికక్రింద కల్లూరులో నిర్మించిన ప్రాథమికఆరోగ్యకేంద్రానికి ఉపముఖ్యమంత్రి శ్రీ నీలంసంజీవరెడ్డి మొన్న 15 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ప్రజల ఆదరాభిమానాలతో 30 వేలు వ్యయపరచి నిర్మించినట్లు ఆరోగ్యకేంద్ర సంఘాధ్యక్షుడు శ్రీ యం. నాగముల్లారెడ్డి తెలియజేశారు.

సభకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు.

కర్నూలు కడపకాలవ, బాపాడు కాలవ మరమ్మత్తుల పనిని వివరిస్తూ అనతికాలంలో పరిశీలనచేసి, మరొక 10 వేల ఎకరాల అదనపు వ్యవసాయానికి అనుకూలంగా నీరు అందేటట్లు చేస్తామని శ్రీ సంజీవరెడ్డి హామీ యిచ్చారు. ప్రజలు యీ ఆస్పత్రి భవన నిర్మాణమునకు 15 వేల రూపాయలు విరాళమిచ్చి, కృషి చేసినందుకు అభినందనీయులని, యీ ఆస్పత్రి చుట్టుపక్కల 10 గ్రామాలకు పనికివస్తుందని, గ్రామాలకు పనికివచ్చే పనులుచేసుకుంటూ, కూలీలు మానుకుని అందువల్ల పోగుచేసే ఖర్చు గ్రామసౌభాగ్యానికి ఉపయోగపడు కార్యక్రమములకు వినియోగించుకోమని సలహా యిచ్చారు. అందరిని కూడగట్టుకుని ప్రజలకు యీ సౌకర్యం కలిగించిన శ్రీ నాగముల్లారెడ్డిని అభినందించారు.

శ్రీ అల్లూరు సత్యనారాయణ రాజు కల్లూరు గ్రామప్రజల స్వయంకృషిని అభినందిస్తూ, స్వరాజ్యంలో పెద్ద పెద్ద పనులన్నీ ప్రభుత్వం, చిన్నచిన్న పనులు ప్రజలు చేసుకోవలసి ఉంటుందని అన్నారు. పెద్ద పనులు పూర్తి అయిన తరువాత మిగిలిన చిన్నచిన్న పనులు ప్రభుత్వమే చేయిస్తుందని అంతవరకు ప్రజలు ప్రభుత్వంతో యథాశక్తి సహకరించాలని విజ్ఞప్తిచేశారు.

బాపట్ల తాలూకా వెల్లటూరు పాలెం గ్రామ పంచాయితీకి ఈ దిగువ సభ్యులు ఎన్నికైనారు. శ్రీయుతులు పనిదెంపు రావయ్య, నాన్నపాటి వెంకటప్పయ్య, ఎం వాసుదేవయ్య గడ్డిపాటి భూషయ్య, మొప్పవరపు వెంకట స్వయ్య, బి. వెంకటరత్నం, బి. సాంబయ్య గారలు.

# వశిష్టపాయపై వంతెన

## ప్రజల సహకారంతో నిర్మాణం

రాజోలు, ఏప్రిల్ 18: పేకిరెట్టి పాలెం అప్పనరాముని లంక మధ్యగల వశిష్టపాయపై వంతెనకు తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు శ్రీ ఎ. కృష్ణస్వామి నిన్న ప్రారంభోత్సవము జరిపారు.

కలెక్టరుకు గ్రామపంచాయితీల అధ్యక్షులు రావూరి సూరన్న, రుద్రరాజు వెంకట్రామరాజు స్వాగతమిచ్చారు.

ఈ వంతెన రూ 16000 లో తయారైంది. ఇందులో సగభాగం ప్రభుత్వం, మిగిలిన అర్ధభాగము అప్పనరాముని లంక గ్రామపంచాయితీ, ప్రజలు భరించారు. 18000 లో అంతర్వేది పాలెం పంచాయితీ బాగుచేయించిన చెరువునుకూడా కలెక్టరు చూశారు. పేకిరెట్టిపాలెం బల్లకట్టురేవుకి వంతెన, అప్పనరాముని లంకకు కంకరరోడ్డుల ఆవశ్యకతను కలెక్టరుకు చెప్పుకున్నారు. (స్వవి.)

# సారస్వత సమాజాలు

## అంబాజీపేట

అంబాజీపేట, ఏప్రిల్ 16: బోర్డు ఉన్నత పాఠశాల సారస్వత వ్యాయామసంఘ వార్షికోత్సవం యీ నెల 8 న జరిగింది. శ్రీ బి. వటుంబరావు స్వాగతమిచ్చారు. శ్రీ వి. సత్యనారాయణమూర్తి, పతాకం ఎగురవేశారు. శ్రీ కె. వి. ఆర్. దీక్షితులు శాలల పతాకం ఎగురవేశారు. సాయంత్రం శ్రీ టి. కైలాసరావు అధ్యక్షతన సభ జరిగింది. శ్రీ వి. సూర్యనారాయణ శాస్త్రి భారతి ప్రశస్తి గురించి వుపన్యసించారు. శ్రీ యస్. రామమూర్తి దర్శకత్వాన విద్యార్థులు నాటికలు ప్రదర్శించారు. శ్రీ వి. కామేశ్వరరావు పండులు బహుమతులు పంచారు. శ్రీ జె. యల్. నరసింహమూర్తి నివేదిక చదివారు.

## సూళ్లూరుపేట

బోర్డు ఉన్నత పాఠశాల సారస్వత సంఘ వార్షికోత్సవం శ్రీ గాదిరెడ్డి అధివారణ అధ్యక్షతన జరిగింది. శ్రీ సి. రామస్వామిరావు ముగింపు వుపన్యాసం చేశారు. బహుమతి ప్రదానం, నాటికా ప్రదర్శన జరిగాయి.

18 వ తేదీన విద్యామంత్రి శ్రీ చంద్రమౌళి యీ పాఠశాలను సందర్శించారు. విద్యార్థులు ఉపాధ్యాయులు హరిజనవాడను సుభ్రపరచారు.

## అమలాపురం

బోర్డు ఉన్నతపాఠశాల వైజ్ఞానిక సమితి వార్షికోత్సవం శ్రీ పి. రామచంద్రరావు అధ్యక్షతన జరిగింది. అధ్యక్షులు లలిత కళల ప్రాధాన్యం వివరించారు. శ్రీ యం. వి. సుబ్బారావు స్వాగతమిచ్చారు. శ్రీ కోనేరు అప్పలమూర్తి, శ్రీ పి. వి. అవధానులు, శ్రీ యం. వి. సుబ్బారావు, ప్రసంగిస్తూ విద్యార్థులు ఉత్తమ పౌరులు కావాలని వుద్బోధించారు. సంగీతకుల సంఘం ఒకటి శ్రీ కె. వి. కృష్ణారావు అధ్యక్షుడుగా ఏర్పాటయినది.

## బరంపురం

పురపాలక ఉన్నతపాఠశాల వార్షిక బహుమతి ప్రదాన సభ యిటీవల కలెక్టరు శ్రీ "కాన్. ఇ. ఘోష్ అధ్యక్షతన జరిగింది. శ్రీ వి. వి. యస్. ఆచార్య నివేదిక చదివారు. బహుమతులు కలెక్టరు భార్య ప్రదానం చేశారు. శ్రీ బృందావననాయక్ ప్రసంగిస్తూ యీ విషయమై శ్రద్ధవహిస్తామన్నారు. విద్యార్థులు నాటకలు ప్రదర్శించారు.

పెకింగ్, ఏప్రిల్ 20: పాకిస్తాన్ ప్రధానమంత్రి శ్రీ మహమ్మదాలీ మే 17 నుంచి 15 రోజులపాటు చైనాలో పర్యటిస్తారు.

# గూడూరు తిరుపతి రైలుమార్గం

## వచ్చేజనవరికి బ్రాడ్‌గేజ్

శ్రీకాళహస్తి, ఏప్రిల్ 16: గూడూరు - తిరుపతి రైలు మార్గాన్ని బ్రాడ్ గేజ్ రైలుమార్గంగా మార్చేపని వచ్చే జనవరినాటికి పూర్తి చేయడానికి రైల్వేసిబ్బంది శ్రద్ధతో వుత్సాహంగా పని చేస్తోందని, యిది సాధ్యమనే ఆశిస్తున్నామని రేణిగుంట ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ టి. ఆర్. తింగస్వామి నిన్న రైల్వే వారోత్సవ సందర్భంలో చెప్పారు.

పార్లమెంటుసభ్యుడు శ్రీ ఎ. బలరామరెడ్డి, డి. ఎస్. పి. శ్రీ థామస్ లకు రైల్వేసేవవద్ద స్వాగతమిచ్చారు. టవర్ సిగ్నల్ వద్ద రైల్వే వారోత్సవానికి శ్రీ బలరామరెడ్డి ప్రారంభంచేశారు. శ్రీ తింగస్వామి అధ్యక్షత వహించారు. శ్రీ బలరామరెడ్డికి రైల్వేసిబ్బంది స్వాగతపత్రం సమర్పించారు.

శ్రీ తింగస్వామి మాట్లాడుతూ రైల్వేలను జాతీయం చేశాక జరిగిన అభివృద్ధిని సమీక్షించారు. మూడవ తరగతి పెట్టెలకుకూడా వల్లవరిచే యంత్రాలను అమర్చే వుద్దేశం కలదన్నారు. ముఖ్యమైన స్టేషన్లలో మంచినీరు, స్నానాల వసతి కలగజేశారని చెప్పారు. ఇంజన్ల పెట్టెల తయారీని హెచ్చించి రైళ్లల్లో రద్దీ తగ్గించడానికి తీసుకుంటున్న చర్యలను వివరించారు. జనవరి 1 నాటికి బ్రాడ్ గేజ్ రైళ్లను యీ మార్గంలో ప్రవేశపెట్టటానికి వీలుగా రైల్వే సిబ్బంది కష్టించి పనిచేస్తోందన్నారు.

శ్రీ బలరామరెడ్డి సమాధానమిస్తూ రైల్వేలో జరుగుతున్న అభివృద్ధిపనులను సమీక్షించారు. మనదేశంలో 35 వేల మైళ్ళ ప్రాంతంలో రైళ్లు నడుస్తున్నాయని ప్రపంచంలో మనది మూడవ స్థానమని చెప్పారు. కొద్దికాలంలో ప్రభుత్వం సాధించిన విజయాలను అభినందించారు. మరో 10 సంవత్సరాలలో మనం ప్రపంచంలో ప్రథమ స్థానం లభించగలదన్నారు. ఇంజనీరింగు సిబ్బంది కృషిని ప్రశంసించారు. ఇకనుంచి ఇంజన్లు, రైలుపెట్టెలకోసం విదేశాలమీద ఆధారపడి వక్కర్లేదన్నారు. ప్రభుత్వం కలుగజేస్తున్న సౌకర్యాలను ప్రజలు సరిగా వుపయోగించుకోవాలని, సహకరించాలని కోరారు.

శ్రీయుతులు పి. గోపాలయ్య, జె. పి. ప్రసాద్, ఎ. కృష్ణమూర్తి ప్రసంగిస్తూ ప్రజలుకూడా తమ బాధ్యతలు గుర్తించాలని కోరారు. శ్రీ థామస్ బహుమతులు పంచారు. వెంకటగిరి కల్చరల్ ఆర్ట్సు థియేటర్సు సభ్యులు 'నిరాశ' నాటిక ప్రదర్శించారు. శ్రీ యస్. ఎ. శాస్త్రినాయుడు వందన సమర్పించారు.

# కనుమనపల్లె యామనపల్లెరోడ్డు

## ప్రారంభోత్సవం

చిత్తూరు, ఏప్రిల్ 18: పుప్పానికి 3 మైళ్ళలో ఉన్న కనుమనపల్లె గ్రామంనుంచి యామనపల్లె గ్రామానికి 10 ఫర్లాంగుల రోడ్డుకు స్థానిక పరిపాలనా శాఖ మంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావుగారు ప్రారంభోత్సవం చేశారు.

మంత్రి మొన్న ఉదయం మద్రాసు నుంచి తిరుత్తణికి వెళ్లారు. అక్కడ పంచాయితీని తనిఖీచేసి రామకృష్ణరాజుపేట, అమ్మవారి పుప్పం గ్రామాలమీదుగా చిత్తూరు తాలూకా మేల్పాడి గ్రామానికి మంత్రి వెళ్లారు. జిల్లా కలెక్టరు శ్రీ యాగంటి, శాసనసభ సభ్యుడు శ్రీరంగనాథ మొదలియార్, తహసీల్దారు మొదలైనవారు ఆ గ్రామంలో మంత్రికి స్వాగతమిచ్చారు. గ్రామస్థుల అవసరాలను వివరించుతూ పంచాయితీ ఒక విజ్ఞప్తిని సమర్పించారు.

అక్కడినుంచి చిత్తూరు వచ్చి ఆ రాత్రి ఇక్కడ మకాంచేశారు.

జిల్లా కలెక్టరు శ్రీ యాగంటి, శాసనసభ సభ్యుడు శ్రీ రంగనాథమొదల్యార్ వెంటరా నిన్న ఉదయం బయిరెడ్డిపల్లె, వెంకటగిరికోట గ్రామాలమీదుగా పుప్పం గ్రామానికి మంత్రి వెళ్ళారు.

పుప్పం పంచాయితీబోర్డు, గ్రామ కాంగ్రెసు మంత్రికి సన్మానపత్రాలు సమర్పించారు.

పుప్పం తాలూకా ఏర్పాటు చెయ్యాలని, అక్కడి ఆసుపత్రిని అభివృద్ధిచెయించమని, మంచినీట సప్లయి సౌకర్యం కలిగించమని మంత్రిని కోరారు.

అతర్వాత పుప్పం గ్రామానికి 3 మైళ్ళలో ఉన్న కనుమన పల్లె గ్రామంనుంచి యామన పల్లె గ్రామానికి 10 ఫర్లాంగుల రోడ్డుకు మంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఆ రెండు గ్రామాల పంచాయితీ బోర్డులు ఈ రోడ్డును నిర్మించారు.

ఆ తర్వాత మంత్రి పుప్పం గ్రామానికి తిరిగివచ్చి శ్రీయుతులు రామబ్రహ్మం వజ్రవేలుసెట్టి మొదలైనవారు ఏర్పాటుచేసిన విందులో పాల్గొన్నారు.

మంత్రిని లక్ష్మీపురం గ్రామానికి శ్రీ డి. శ్రీనివాస అయ్యంగార్ తీసుకు వెళ్ళి అక్కడి విశేషాలు చూపించారు.

# సామాజిక దృష్టి అవసరం

## రాఘవ నాటకస్మారక సభల్లో ప్రసంగం

విజయనగరం, ఏప్రిల్ 18: "నూతన సంస్కృతికి సామాజికదృష్టి అవసరం. పాలి నమ్మకాలకుబదులు కొత్తని ప్రజలకు ఏర్పడాలి," అని ఈ పట్టణంలో జరుగుతున్న రాఘవ స్మారక నాటకోత్సవాలలో రెండవరోజు కార్యక్రమంలో టౌన్ హాలులో శ్రీ గురజాడ అప్పారావు చిత్రపటాన్ని ఆవిష్కరించుతూ శ్రీ రోణంకి అప్పలస్వామి అన్నారు. సభకు ప్రసిద్ధ నటుడు శ్రీ పీసపాటి అధ్యక్షత వహించారు.

అప్పారాయకవి ప్రతిభను శ్రీ అప్పలస్వామి ఉగ్గడించి ఇట్లా అన్నారు: "వ్యావహారికభాషలోనే మహాకావ్యాలను వ్రాయాలని మహాకవిఅభిప్రాయం. 'ముత్యాల సరాలు' ఈ పద్ధతిలోనే వున్నది. అయితే అది మనెవరో వ్రాసిన పాటలసంపుటి అన్న అభిప్రాయమొకటి ఉన్నది. అది సరయిన నమ్మకంకాదని నాగట్టి నమ్మకం." ఆ తర్వాత 'ముత్యాల సరాలు' కావ్యంలోని కొన్ని భాగాలను శ్రీ అప్పలస్వామి చదివారు.

మహాకవి పాత్రలను రూపొందించిన రీతులను వివరించుతూ శ్రీ అవసరాల సూర్యారావు ప్రసంగించారు. శ్రీ పీసపాటి వందనసమర్పణ చేశారు.

## రాఘవ స్మారక ఉత్సవాలు

విజయనగరం, ఏప్రిల్ 17: ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ పెమ్మరాజు వెంకటరావు అధ్యక్షతన రాఘవ స్మారకోత్సవాలు నిన్న ఇక్కడ ప్రారంభమైనవి. శ్రీయుతులు పీసపాటి ఎ. నాగేశ్వరరావు మొదలైనవారు సభకు వచ్చారు. సభికులకు శ్రీ పీసపాటి స్వాగతం చెప్పారు. ఉత్సవాలను సినిమానటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు ప్రారంభించారు. (ఆయన ప్రసంగం నిన్ననే ప్రకటించాం)

రాఘవ నాటకోత్సవ నిర్వాహక సంఘం శ్రీ నాగేశ్వరరావుకు సన్మానం చేశారు. కానుకగా సువర్ణాంగుళాన్ని బహూకరించారు. కార్యదర్శి శ్రీ జగన్నాథరావు సన్మాన పత్రం సమర్పించారు.

గీతా నృత్య కళామందిర్ పూజా నృత్యం చేశారు. నాటకాల పోటీ ప్రారంభమైంది. సమూరి సోమయాజుల క్యాముల నృత్యం చేసింది. నటరాజ కళాసమితి (శ్రీకాకుళం) "ఇల్లుఅమ్మబడును" అనే నాటికను ప్రదర్శించారు. విజయనగరం ప్రజానాట్య మండలి 'ఒక రూపాయి' నాటికను ప్రదర్శించారు.

# దస్తావేజు రుసుం చెల్లించని నేరం

## హైకోర్టులో దరఖాస్తు

గుంటూరు, ఏప్రిల్ 19: దస్తావేజు చట్టం ప్రకారం తనకు జరిమానా విధించుతూ జారీ చేసిన ఉత్తరువును అనులాపురం రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, తూర్పు గోదావరిజిల్లా కలెక్టరు అమలు జరపకుండా ఉత్తరువు లివ్వించమని కోరుతూ రాజోలు న్యాయవాది శ్రీ కె. వియన్న తెచ్చిన 'రిట్' దరఖాస్తును హైకోర్టు న్యాయమూర్తి శ్రీ సత్యనారాయణరాజు నంగీకారం వాదనలు విని దాఖలు చేసుకున్నారు. దరఖాస్తుదారు కోరినట్టు తాత్కాలిక ఉత్తరువు లిచ్చారు.

దరఖాస్తు వివరాలివి: ఒక దావా సందర్భంలో ఆస్తుల పంపిణీ జాబితా ఒకటి ఒక కోర్టులో దరఖాస్తుదారు దాఖలు చేశారు. జాబితాను కోర్టు స్వాధీనం చేసుకున్నారు. ఆ తర్వాత దానిని క్రమ దస్తావేజుగా రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు పరిగణించి దస్తావేజు ఋసుం, జరిమానాలకింద రు 1820 చెల్లించమని ఉత్తరువుచేశారు. డబ్బు చెల్లించనందున దరఖాస్తుదారుని ఆస్తిని రెవిన్యూ అధికారులు వేలం వేయనున్నారు.

తాను దాఖలుచేసింది దస్తావేజుల చట్టం నిర్వచనం ప్రకారం ఋసుం చెల్లించవలసిన ఆస్తిపంపిణీ దస్తావేజు కాదని, క్రమమైన దస్తావేజు తయారయ్యేవరకు వినియోగపడే ఆస్తిజాబితా మాత్రమేనని దరఖాస్తుదారు వాదన. జరిమానా ఉత్తరువుపై జిల్లా కలెక్టరుకు దరఖాస్తుదారు అప్పీలు చేశాడు. జరిమానా, దస్తావేజు రుసుం ముందుగా చెల్లించలేదు కనుక అప్పీలును విచారించడానికి వీలులేదని జిల్లాకలెక్టరు త్రోసివేశారు. అంతేకాక అసలు అప్పీలును రెవెన్యూబోర్డు త్రోసివేసిందని కూడా తెలియచేశారు.

అప్పీలుతోబాటే జరిమానాను, దస్తావేజు ఋసుం చెల్లించవలసిన అవసరం చట్టంలో లేదు కనుక అప్పీలును త్రోసివేసే అధికారం జిల్లా కలెక్టరుకు లేదని దరఖాస్తుదారుని వాదన. పైగా ఒక చోట అప్పీలును విచారించ వీలులేదంటూ మరొక చోట అప్పీలును రెవెన్యూబోర్డు త్రోసివేసిందనడం పరస్పర విరుద్ధంగా ఉన్నదన్నారు. రెవెన్యూబోర్డుకు తాను అప్పీలు చేసుకోనిదే బోర్డు అప్పీలును త్రోసివేసిందనటం అసంబద్ధంగా ఉన్నదన్నారు.

రిట్ దరఖాస్తును న్యాయమూర్తి దాఖలుచేసుకుని దరఖాస్తుదారుని ఆస్తిని వేలంవేసే వీలులేకుండా తాత్కాలిక ఉత్తరువులనిచ్చారు. దరఖాస్తుదారు తరఫున శ్రీ అవని రామారావు వాదించారు.

## గంటల పంచాంగం

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ ద్వాదశి 1956- సం॥ ఏప్రిల్ 22 ఆదివారం. తి॥ ద్వాదశి 9-1 ఉ ఫ 21-50 వర్జ్యం 6-57 కు.
శు॥ త్రయోదశి ఏప్రిల్ 23 సోమవారం తి॥ త్రయోదశి 7-58 హస్త 21-43 వర్జ్యం 6-11 ల 7-47 కు.


# ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు టా పొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్ (మహాభారతము)

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ ద్వాదశి ఆదివారం


## ప్రజల తోడ్పాటు

ద్వితీయ ప్రణాళికను ప్రారంభిస్తున్న ఈ సమయంలో దేశ ఆర్థిక పరిస్థితుల విషయమై నిరాశకు, నిస్పృహకు తావివ్వవలసిన అగత్యంలేదని కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ మొన్న లోక్‌సభలో తమ పద్దులపై జరిగిన చర్చలో వచ్చిన విమర్శలకు జవాబుగా హామీ ఇచ్చారు. తొలి పంచవర్ష ప్రణాళిక ఫలితంగా జాతీయాదాయం నూటికి 18 వంతులు, వ్యక్తి ఆదాయం 11 వంతులు పెరిగిందని చెప్పి శ్రీ దేశముఖ్ తమ వాదనను బలపరుచుకున్నారు. ఈ వివరాలు తప్పనిగాని, జాతీయాదాయం పెరగలేదని గాని ఎదురువాదన చేయడం సాహసమే అనిపించుకుంటుంది. అయితే, ఇది సాధారణ పౌరునికి ఎంతవరకు లాభించిందన్నదే ప్రశ్న.

నిత్యావసర పదార్థాల ఉత్పత్తికి సంబంధించినంతవరకు ప్రథమ ప్రణాళికాకాలంలో ఘనమైన విజయాలనే దేశం సాధించగలిగిందని చెప్పాలి. ప్రణాళికలో నిర్దేశించిన లక్ష్యాన్ని మించే వస్త్రోత్పత్తి అయింది; ఆహారవిషయంలో చాలావరకు స్వయం సమృద్ధి చేకూరిందనే ఒప్పుకోవాలి; ఎరువుల ఉత్పత్తి స్వయం సమృద్ధం గాకపోయినా, సింద్రీ మొదలైన కర్మాగారాలలో లక్ష్యానికి మించే సాగింది. అంకెల దృష్ట్యా పరిశీలిస్తే పరిస్థితి అత్యంత ఆశావహంగానూ, సంతృప్తికరంగానూ కనబడేమాట వాస్తవం. అయితే, ప్రజల కొనుగోలు శక్తి ఏమాత్రం పెరిగింది?

గత ఐదేళ్లలో భారత దేశం సాధించిన ఆర్థికాభివృద్ధి అల్పమైనదికాదు. దేశపరిస్థితులను చూడవచ్చిన ప్రతి విదేశీయుడూ హృదయపూర్వకంగా అభినందిస్తూనే వున్నాడు. బ్రిటిష్ పార్లమెంటు కార్మిక పక్ష సభ్యుడు శ్రీ జాన్ స్ట్రాచీ భారత ప్రభుత్వం సాహసోపేతంగానే గాక, అతి నిబ్బరంగా కూడా వ్యవహరిస్తున్నదని చెప్పిన మాటలలో అతిశయోక్తి ఏమీ లేదు. "భారతదేశం స్వల్ప వ్యవధిలో మహత్తరమైన ఫలితాలనే సాధించింది. సమాజాభ్యుదయాన్ని ఏ ప్రభుత్వమైనా అనేక మార్గాలలో సాధించవచ్చు. భారత ప్రభుత్వం ఇప్పుడు అనుసరిస్తున్న మిశ్రమ ఆర్థికవిధానం ప్రశంసనీయమైనది..." అని మొన్న హైదరాబాదులో ద్వితీయ ప్రణాళికా పరిషత్ సభలో ప్రసంగిస్తూ శ్రీ స్ట్రాచీ వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించని విదేశీయులు గాని, స్వదేశీయులు గాని వుండరు. ద్వితీయ ప్రణాళికాచరణకు చేయదగిన సహాయాన్ని గురించి పరిశీలించడానికి ఇప్పుడు దేశంలో పర్యటిస్తున్న ప్రపంచ బ్యాంకు ప్రతినిధివర్గం కూడా ఇదేవిధమైన భావాలను వ్యక్తీకరిస్తుందనడంలో సందేహంలేదు.

భారీపరిశ్రమలతోపాటు మధ్యరకం పరిశ్రమలకు, చిన్నరకం కుటీర పరిశ్రమలకు, వ్యవసాయాభివృద్ధికి ఉపయోగపడే నీటివనరుల నిర్మాణానికి ద్వితీయ ప్రణాళిక తగిన ప్రాధాన్యం ఇస్తున్నమాట వాస్తవమే. ఏ ప్రణాళికా నిర్వహణకైనా ఆర్థికబలం తర్వాత అవసరంగా కావలసింది అంగబలం. మన దేశానికి సంబంధించినంతవరకు అంగబలానికి లోటు లేదు. ఈ బలాన్ని సక్రమంగా సమీకరించి సద్వినియోగం చేయడం మీదే ద్వితీయ ప్రణాళిక విజయం చాలావరకు ఆధారపడివుంటుంది. ప్రజాబాహుళ్యం ఉత్సాహంతో ముందుకువచ్చి ద్వితీయ ప్రణాళికా నిర్వహణలో సహాయపడాలంటే నిత్యావసర వస్తువులపై పన్నుల భారం పెరిగి వారికి బ్రతుకే బరువుగా పరిణమించేట్లు కేంద్రప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వాలుగాని చేయకూడదు.

## దేశంలో ఏటా 9 వేల ఖూనీలు
### మరణశిక్ష తొలగింపు అసాధ్యం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: భారతదేశంలో ఏటా 9 వేల ఖూనీలు జరుగుతుంటే మరణశిక్షను శాశ్వతికంగా నిలుపు చేయడం అవసరంగాని సాధ్యంగాని కాదు అని దేశీయ వ్యవహారాలశాఖ ఉపమంత్రి శ్రీ దాతార్ యివాళ లోక్ సభలో చెప్పారు.

బుద్ధజయంతి సందర్భంలో ఉరిశిక్ష తాత్కాలికంగా ఆపుచేయాలని బౌద్ధ వర్గాలేవైనా విజ్ఞప్తిచేశారా, అని కొందరు ప్రశ్నించారు. సింహళ ప్రభుత్వం బుద్ధజయంతి సందర్భంలో ఉరిశిక్ష ఆపుచేయాలని నిశ్చయించిందన్న సంగతికూడా ఆయనకు చెప్పారు.

వీటికి దాతారు సమాధానం యిచ్చారు. బ్రిటన్‌లో ఉరిశిక్ష రద్దు విషయంలో కొంత అనుకూలత చూపుతున్నారు. అయితే, బ్రిటన్ పరిస్థితులకు మనకు తేడా ఉన్నదని ఆయన అన్నారు.

## బాగ్దాద్ కూటానికి భారత అధిక్షేపణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: టెహరాన్ సమావేశంలో కాశ్మీరు ప్రసక్తి తెచ్చినందుకు, భారత ప్రభుత్వం బాగ్దాద్ కూటమి రాజ్యాలకు అధిక్షేపణ పంపుతున్నది.

ఇదివరలో కరాచీలో మనీలాసంధి రాజ్యాలు కాశ్మీరు ప్రసక్తిని తెచ్చినందుకు యిదేవిధంగ భారత ప్రభుత్వం మనీలా సంధి రాజ్యాలకు అధిక్షేపణ తెలిపింది.

## గోవా విద్యార్థులకు పరీక్షలు
### కరాచి నిర్వహణ

సూరత్, ఏప్రిల్ 21: గోవా విద్యార్థులకు కరాచి ఎస్. ఎస్. సి. బోర్డు త్వరలో పరీక్షలు జరుపుతుందని, గోవా రేడియో యివాళ ప్రకటించింది.

విద్యార్థులు తలా రూ 40 పరీక్ష రుసుం క్రింద చెల్లించాలట.

## జార్జియాలో స్టాలిన్ భక్తులు

మాస్కో, ఏప్రిల్ 20: స్టాలిన్ వ్యక్తి ఆరాధనను ప్రస్తుత రష్యా అగ్రనాయకులు నిశితంగా ఖండిస్తున్నా లెక్క చేయక, స్టాలిన్ జన్మస్థలమైన గోరీలో 8 లక్షల రూబుల్స్ వ్యయంతో ఆయన స్మృతి సూచకంగా బ్రహ్మాండమైన ప్రదర్శనాలయం నిర్మించాలని జార్జియా రిపబ్లిక్ నిశ్చయించింది. విషయాన్ని ఆ ప్రాంత పార్టీ కార్యదర్శి ప్రకటించాడు.

ఇటీవలిదాకా చరిత్ర, ద్వితీయ యుద్ధ కాలంలో స్టాలిన్ పాత్ర గురించి ఎలా బోధించినా, గోర్కీలోమాత్రం పనుకట పద్ధతే అవలంబిస్తారట.

---

వాషింగ్టన్, ఏప్రిల్ 19: ఇజ్రేల్ లో అణు రియాక్టరు నిర్మాణానికి 3 లక్షల డాలర్లను అమెరికా అణుశక్తి సంఘం ఇస్తుందని ప్రకటన వెలువడింది.

## ఏపనీచేయకుండానే భారతకమ్యూనిస్టులు తప్పులు చేస్తున్నారు
### డా॥ లోహియా విమర్శ

హైదరాబాదు, ఏప్రిల్ 20: "కొన్ని ప్రయోజనాలను సాధించినతర్వాత రష్యా కమ్యూనిస్టులు తప్పులు చేశారు. అటువంటి ప్రయోజనాలేమీ లేకుండానే భారతీయ కమ్యూనిస్టులు తప్పులు-నేరాలు చేశారు. 1942 విప్లవంలో భారతీయ కమ్యూనిస్టులు బహిరంగంగా జాతీయపతాకను అగౌరవపరచి మహాత్మా గాంధీని నిందించడం నేర్చుకున్నారు" అని తన పార్టీ సభ్యులకు పంపిన సర్క్యులర్‌లో సోషలిస్టు పార్టీ నాయకుడు డాక్టరు రామమనోహర్ లోహియా వివరించారు.

రష్యాలో ఇటీవల జరిగిన సంగతి సందర్భాలపై డాక్టరు లోహియా ఇట్లా వ్రాశారు. "చెంగిజ్ ఖాన్ కాలంలో, స్టాలిన్ ఆసియా మహానాయకులలో ఒకడు రష్యా ప్రజలలో అధిక సంఖ్యాకులైన యూరోపియనులను పాశ్చాత్యదేశాల, అమెరికా ప్రజల స్థాయికి అభివృద్ధి చేశాడు స్టాలిన్. ఇంత చేసినా జరిగి తీరాల్సిందేమో ఆయనకు జరిగింది.

"ఇక తాము వెనుక పడిన వారూ కాదు, ఆసియా వాసులూ కాదు, ఆధునికులైపోయారు కనుక స్టాలిన్ అవసరం రష్యా ప్రజలకు తీరింది."

"స్టాలిన్ జీవితంనుంచి ఆసియా ప్రజలు, నాయకులు గుణపాఠం గ్రహించాలి. పశ్చిమ యూరప్ దేశాలంత బలంగా, అమెరికావంటి దేశాల ఆధునికంగా రష్యా ఇప్పుడు తయారైంది కనుక, దేశంలో భయాందోళనలు సద్దుమణిగినవి కనుక ఆ దేశం యూరప్ దేశాలలో కలిసిపోవడం అవసరం; అట్లా జరిగింది కూడా; ఒక రకంగా చూస్తే రష్యా యూరప్ దేశాలలో కలిసిపోవడం అనేది మానవతా ప్రపంచంలోకి తిరిగి రావడమన్నమాట. అంటే దేశీయ వ్యవహారాలలోను, అంతర్జాతీయంగానూ కూడా ధర్మబద్ధంగా రష్యా ఇక వ్యవహరిస్తుంది."

"విజాతంగ విధానంలో కొన్ని ప్రయోజనాలను ఆశించి సోషలిజాన్ని అధికారంలో ఉంచడాన్ని కమ్యూనిజం అభిలషిస్తుంది. రష్యా మళ్లీ యూరప్ దేశాల కుటుంబంలో చేరింది కనుక బ్రిటనులోని కన్సర్వేటివ్, లేబర్ పార్టీల మధ్య తగాదాలను ప్రోత్సహించే సందర్భములో రష్యా కొంత పాత్రవహిస్తూ నిర్వహించుతుంది. భారతదేశంలోని కాంగ్రెసుపార్టీ, బ్రిటనులోని లేబర్ పార్టీల వంటి వాటిలో విదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు కలిసి పోవడానికి ప్రయత్నించగలవు. కమ్యూనిజం అవలంబించే నూతన విధానాల పర్యవసానంగా రష్యాలోనూ కొన్ని యూరప్ దేశాలతోనూ తప్ప చాలా దేశాలలో కమ్యూనిజం ప్రాబల్యం తగ్గిపోతుందనడంలో అనుమానమేమీ లేదు. కమ్యూనిస్టు చైనా సంగతి ఇంకా ఎటూ తేలలేదు."

"స్టాలిన్ చరిత్రను కుడిచి వేయడానికి జరిగిన కృషిలో భారతీయ కమ్యూనిస్టుల ఆత్మగౌరవమంతా గంగలో కలిసింది. రష్యాలో నేమో ఆర్థిక వ్యవస్థ నిర్మాణం జరిగిన తరువాత ఇదంతా జరిగితే భారతీయ కమ్యూనిస్టులకిది కేవలం పొరపాటుగా మాత్రమే రూపొందలేదు. రష్యా ప్రజలు తప్పేమైనా చేస్తే ప్రయోజన పడిన తర్వాతనే తప్పుచేశారు. ప్రయోజన మేమీ లేకుండానే భారతీయ కమ్యూనిస్టులు తప్పుచేశారు. 1942 లో దేశంలో జరిగిన విప్లవంలో తమ తోటి పౌరులను అణగ ద్రొక్కివేసే విధ్వంసక కృత్యంతో విదేశీ పరిపాలకులతో భారతీయ కమ్యూనిస్టులు చేతులుకలిపి పనిచేశారు. జాతీయపతాకను కించపరచి మహాత్మా గాంధీని నిందించడం నేర్చుకున్నారు. ప్రపంచ విప్లవంలోను, స్టాలిన్ నాయకత్వంలోను నమ్మకం పెట్టి కమ్యూనిస్టులు అట్లా చేయగలిగారు.

### "ఎన్నికలలో పోటీ చేయ్యం"

మహారాష్ట్రం, బెంగాల్ లలో భాషా సమస్యపై కమ్యూనిస్టులతో గాని, స్తంభించిపోయిన సోషలిస్టుల తోను చేతులు కలిపి ఐక్య సంఘటనలు చేయవద్దని సర్క్యులరులో సోషలిస్టులకు డాక్టరు లోహియా ఇలా హెచ్చరించారు:

"ఏక గ్రీవ ఆమోదంతో పునర్విభజన పార్టీలతోను, నెహ్రూతో మల్లయుద్ధం చేసే పార్టీలతోను చేతులుకలిపి పనిచేయడం సరియైతే ప్రధాన రాజకీయ పార్టీ అంటే ప్రభుత్వం నిర్వహిస్తున్న కాంగ్రెసుతోనే ఎందుకు కలిసి పనిచేయ్యరాదూ?"

ప్రతిపక్ష పార్టీలమనే పటాటోపం చూపించే ఈ పార్టీలలో వోటర్లను అయోమయంలో పడేసే పరస్పరాంగీకారం ఉన్న అంశాలపై కలిసి పనిచేయడం లేదని సోషలిస్టు పార్టీని నిందించవచ్చు. దీనికి తేలికైన పూర్తి జవాబు: "సోషలిస్టు పార్టీ ఎన్నికలలో పోటీ చేయదు."

---

ఖాట్మండు, ఏప్రిల్ 19: నేపాల్ రాజు శ్రీ మహేంద్ర పట్టాభిషేక మహోత్సవం మే 2వ తేదీ ఉదయం 10-23 గంటలకు జరుగుతుంది. ఆస్థాన జ్యోతిష్కులు యీ ముహూర్తం నిశ్చయించారు.

## పాక్ ఆయుధశక్తి విజృంభణ
### భారతదేశానికి ఒత్తిడి కలగలేదు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: పాకిస్తాన్‌కు అమెరికా ఇస్తున్న సైనికసహాయంవల్ల భారతదేశం తన పంచవర్ష ప్రణాళికను పునఃపరిశీలన చేయవలసిన అవసరం కలగలేదని నేడు లోక్‌సభలో రక్షణ శాఖ ఉపమంత్రి శ్రీ సుర్జిత్ సింగ్ మజీథియా చెప్పారు. అవసరమైతే, రక్షణ ఖర్చులకు అధికమైన మొత్తాలను అడగవచ్చునని కూడా ఆయన చెప్పారు.

పాకిస్తానుకు అమెరికానుంచి అతి ఆధునాతనమైన ఆయుధ సామగ్రి లభిస్తున్నది గనుక, అటువంటి ఆయుధ సామగ్రిని తయారుచేసేందుకు భారతదేశం రష్యా దగ్గరనుంచి సాంకేతికమైన సహాయాన్ని ఏమన్నా పొందుతున్నాదా అని శ్రీ శివమూర్తిస్వామి ప్రశ్నించగా సర్దార్ మజీథియా ఇట్లా సమాధానం చెప్పారు. అటువంటి ప్రశ్నే ఇప్పుడు ఉత్పన్నం కాదు. సాంకేతికమైన రహస్యాలను మన అంతట మనమే తెలుసుకుంటున్నాము. దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్నప్పుడు సాంకేతికమైన విజ్ఞానంకూడా పెరుగుతూ వుంటుంది. అధికంగా ఉత్పత్తి అధికం అవుతూ వుంటుంది."

## సహకార శిక్షణ
### సంఘాలపై సుంకం వేయాలని సూచన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: అఖిల భారత సహకార సంఘాల మహాసభ ప్రతినిధుల సమావేశం ప్రభుత్వాన్ని అన్ని సహకార సంఘాల లాభాల మీదా "విద్యాసుంకం" విధించవలసిందిగా కోరారు.

ఇట్లా వసూలుచేసిన ధనాన్ని రాష్ట్ర సహకార సంఘాలకు వాటి విధులను శక్తివంతంగా నిర్వహించడానికి ఇవ్వాలని కూడా వీరు సూచించారు.

అధికారులకు సహకారోద్యమంలో శిక్షణ ఇప్పించాలని ఒక తీర్మానాన్ని కూడా వీరు ఆమోదించారు.

ఈ సభలో కేంద్ర సహజ సంపదల మంత్రి శ్రీ కె. డి. మాలవియా మాట్లాడారు. సహకారోద్యమంలో పని చేస్తున్న వారికి మంచి శిక్షణ అవసరమని ఈయన చెప్పారు.

## సంవత్సరాంతానికి 10 వేల పంచాయతీలు
### ఏర్పాటుకు సన్నాహాలు పూర్తికాగలవని మంత్రి ప్రకటన

కర్నూలు, ఏప్రిల్ 20: రాష్ట్రం మొత్తంమీద పదివేల గ్రామ పంచాయతీల ఏర్పాటుచేసే కార్యక్రమమంతా ఈ సంవత్సరాంతంలోగా పూర్తికాగలదని స్థానిక పరిపాలనా శాఖ మంత్రి డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావు చెప్పారు. ప్రస్తుతం పనిచేస్తున్న పంచాయతీలుకూడా యీ మొత్తంలో ఉన్నవి. వాటి పునర్నిర్మాణంకూడా జరుగుతున్నది.

రాష్ట్రంలో సుమారు 17 వేల గ్రామాలున్నవి. దాదాపు రాష్ట్రం మొత్తానికి పదివేల గ్రామపంచాయతీలు సరిపోయేట్టు గ్రామాల వర్గీకరణ జరుగుతున్నది.

గ్రామ పంచాయతీల చట్టం ప్రకారం అయిదు వందలు అంతకు మించిన జనాభాగల గ్రామాలన్నింటికి గ్రామ పంచాయతీలను ఏర్పాటు చెయ్యాలి.

పంచాయతీ ప్రాంతాల్లోని పనులను జరిపించడానికి ఇటీవల ఏర్పాటుచేసిన ఇంజనీరింగ్ శాఖ ప్రశంసనీయంగా పని చేస్తున్నదని కూడా విలేఖరులకు మంత్రి చెప్పారు. ఈ శాఖను ఏర్పాటుచేసినప్పటినుంచి పంచాయతీలో జరగవలసిన పనులు త్వరగాను సంతృప్తికరంగాను జరుగుతున్నవి.

పదివేల గ్రామ పంచాయతీలను యేర్పాటుచేస్తే ఈ ఇంజనీరింగ్ శాఖను విస్తృతం చేయవలసి ఉంటుంది. యీ శాఖకు స్థానిక పరిపాలనాశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ ప్రధానాధికారి. ఆయన కార్యాలయములో డివిజనల్ ఇంజనీర్ అజమాయిషీలో ఈశాఖ ప్రస్తుతం పని చేస్తున్నది.

## హైదరాబాదు జాగీర్ల రద్దు ఫలితం
### నివేదిక తయారి

(స్వకీయ విలేఖరి)

హైదరాబాదు, ఏప్రిల్ 17: హైదరాబాదు రాష్ట్రంలో జాగీర్దారీ విధానం రద్దు పర్యవసానంగా ఏర్పడిన ఆర్థిక సాంఘిక పరిణామాలను తదితర మార్పులను వివరించే నివేదిక ఒకటి భారత ప్రభుత్వ ప్రణాళికల నిర్ణాయక సంఘానికి పంపించారు. బహుశా ప్రణాళిక నిర్ణాయక సంఘం ఆ నివేదికను త్వరలో ప్రకటిస్తారు.

భారత ప్రభుత్వ ప్రణాళికల నిర్ణాయక సంఘము సూచించిన పథకముల ప్రకారము ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్థిక శాఖ నిపుణుల ఆధ్వర్యాన యీ విచారణ జరిగింది.

ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న జాగీరు గ్రామాలలో అమలు జరిపిన కౌలు శాసన గరిష్ఠ కమతాల నిర్ణయం తదితర శాసనాల ప్రభావం వల్ల వచ్చిన మార్పు లన్నింటిని ఈ నిపుణులు పరిశీలించి ప్రణాళికల నిర్ణాయక సంఘానికి నివేదిక పంపించారు.

ఈ పరిశోధనలవల్ల భూసంస్కరణల పరిణామాలు, వాటి మంచి చెడులను గ్రహించే అవకాశం ప్రణాళికల నిర్ణాయక సంఘానికి లభించుతుంది. ఇతర రాష్ట్రాల్లో భూ స్వామ్య విధానాల నిర్మూలనకుకూడా ఈ నివేదిక కొంతవరకు ఉపయోగ పడుతుంది.

## ఏలూరు కాలువలో ముగ్గురి మరణం

విజయవాడ, ఏప్రిల్ 21: ఇక్కడ ఏలూరు కాల్వలో ప్రమాదవశాత్తు ముగ్గురు మరణించారు.

ఆంధ్ర సిమెంటుకంపెనీ ఫోర్మన్ శ్రీ టి. పాండురంగారావు (35 ఏళ్ళు) నిన్నరాత్రి, కంపెనీ పనికి కాల్వ వంతెనమీదుగా వెడుతుండగా కాలుజారి కాల్వలోపడి చనిపోయాడు. ఈ ఉదయం వి. గోవిందరావు (వయస్సు 17 ఏళ్లు) వి. వీరయ్య (9 ఏళ్ళు) స్నానానికి వెళ్ళి, కాలువలోపడి మరణించారు.

ఈ ముగ్గురి శవాలను బయటకు తీయించి, పంచాయితీ జరిపి, ప్రమాదవశాత్తు కాలవలో మరణించినట్లు నిర్ధారించారు.

ఏలూరు కాల్వ కొన్ని రోజులుగా ఒడ్డు వరకు ప్రవహిస్తున్నది.

## వాతావరణం

మదరాసు, ఏప్రిల్ 21: అన్ని చోట్లలో వాతావరణం స్థిరంగా ఉంది. రెంటచింతలలో అన్ని స్థలాలలోకంటే 108 డిగ్రీల గరిష్ఠప్రమాణం ఉష్ణోగ్రత ఉంది.

| | | | |
|---|---|---|---|
| కళింగపట్నం | — | 91 | 80 |
| గన్నవరం | — | 101 | 80 |
| కాకినాడ | — | 96 | 79 |
| బందరు | — | 97 | 82 |
| నెల్లూరు | — | 103 | 79 |
| నిడదవోలు | — | 98 | 78 |
| ఒంగోలు | — | 99 | 81 |
| రెంటచింతల | — | 108 | 81 |
| విశాఖపట్నం | — | 95 | 81 |
| అనంతపురం | — | 105 | 82 |
| ఆరోగ్యవరం | — | 99 | 78 |
| కడప | — | 106 | 87 |
| కర్నూలు | — | 107 | 78 |
| హైదరాబాదు | — | 103 | 72 |
| మదరాసు | — | 94 | 82 |
| బెంగుళూరు | — | 95 | 72 |
| బళ్ళారి | — | 104 | 84 |
| న్యూఢిల్లీ | — | 105 | 77 |

## అమెరికాచే 5 లక్షల గజాల చేనేత వస్త్ర క్రయం

న్యూయార్క్, ఏప్రిల్ 20: సుమారు 5 లక్షల గజాల లుంగీవస్త్రాన్ని యీ ఏడాది మద్రాసులో అమెరికన్ సంస్థలు కొనుగోలు చేయగలవని పత్రికల వార్తలబట్టి తెలుస్తోంది. లుంగీలు ధరించడమంటే అమెరికన్లకు యిప్పుడు చాలా సరదాగా వుంటున్నది.

ఈ వస్త్రంతో చొక్కాలు (క్రీడా దుస్తులు) కోట్లు యింకా స్త్రీల దుస్తులకు వుపయోగిస్తారు. దీనిని ఇక్కడ "మద్రాసు వస్త్రం" అని పిలుస్తున్నారు. అప్పుడే ఒక సంస్థ 15 వేల గజాలకు బేరం ఖాయం చేసుకుంది.

భారత ప్రభుత్వ వాణిజ్య కేంద్రంలో ప్రదర్శించిన వీటిని అమెరికన్ జనాలు ఎంతో హర్షిస్తున్నారు.

## సైప్రస్ దేశభక్తునికి ఉరిశిక్ష
### ప్రజాసభలకు విజ్ఞప్తి

ఏథెన్స్, ఏప్రిల్ 20: ఒక పోలీసును కాల్చి చంపిన నేరానికి ఉరికంబం ఎక్కబోతున్న సైప్రస్ వాసి మైకేల్ కరోలిస్‌ను రక్షించవలసిందిగా అన్ని దేశాల ప్రజాసభలు విజ్ఞప్తి చేయాలని గ్రీకు పార్లమెంటు నేడు కోరింది.

## భాగ్యవంతులు సమాజ శ్రేయస్సుపై శ్రద్ధవహించాలి
### శాసనసభ సభాపతి విజ్ఞప్తి

శ్రీకాకుళం, ఏప్రిలు 19: భాగ్యవంతులు తమ స్వార్థప్రయోజనాలకు పాటుపడకుండా కృషిచేయడం ఈరోజులలో తగదని సమాజ శ్రేయస్సుకై తమ డబ్బును వినియోగించడమే కర్తవ్యమని యీ నెల 15వ తేదీన సింగుపురంలో "బొంతా అప్పారావుపంతులు స్మారక బోర్డు ఉన్నత పాఠశాల"కు ప్రారంభోత్సవం చేస్తూ శాసనసభ సభాపతి శ్రీ రొక్కం లక్ష్మీనరసింహం దొర అన్నారు. సభకు శ్రీ ఇప్పిలి లక్ష్మీనారాయణ అధ్యక్షత వహించారు.

పరిసరప్రాంతి ప్రజలు, పాఠశాల పాలకవర్గం తరఫున శ్రీ బొంతా కృష్ణమూర్తి విజ్ఞప్తులను సమర్పించారు.

పాతపద్ధతులలో వ్యక్తులు ఆస్తులు సంపాదించడం ఇక సంభవంకాదంటూ శ్రీ లక్ష్మీనరసింహం దొర ఇట్లా చెప్పారు: "సింగుపురం గ్రామంలో హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాల ఒకటి ఏర్పాటు చేయించమని మొదట కోరారు. ఆరోజులలో అదే చాలా గొప్పసౌకర్యం. శ్రీకాకుళంలో నాతోపాటు వృత్తి చేస్తున్న న్యాయవాది శ్రీ॥ శ్రీ॥ బొంతా అప్పారావు పంతులు సింగుపురం వచ్చి గ్రామ సాధ్యాభివృద్ధికి, నేత పరిశ్రమ అభివృద్ధికి చాలా కృషిచేశారు. ఆయన కుమారుడు కృష్ణమూర్తి ఉన్నత పాఠశాల భవనానికి స్థలం, డబ్బు ఇచ్చి సహాయపడడం సంతోషం. నెల రోజులలో యీ భవనాన్ని పూర్తి చేయడం ఆనందించదగ్గ విషయం."

"గ్రామాలు బాగుపడాలంటే శ్రీ కృష్ణమూర్తిని ఆదర్శంగా పెట్టుకుని ఇతర యువకులు కూడా అభివృద్ధి పనులకు విరాళాలివ్వాలి. ప్రాంతీయాభివృద్ధి పనుల ఖర్చులో 4వ వంతు ఆయా ప్రాంతాల ప్రజలు విరాళంగా ఇవ్వాలని ప్రభుత్వం ఎందుకు అంటున్నది? మూడు వంతుల ఖర్చు భరించే ప్రభుత్వం మిగతా ఒక వంతూ ఇవ్వలేదా? ఆయా నిర్మాణాలు ప్రజలవనే అభిప్రాయం కలిగించడానికే యీ ఏర్పాటు. అభివృద్ధి పనులను అమలు జరిపే సందర్భంలో ప్రభుత్వంతో అందరూ సహకరించాలి."

శ్రీ ఆచార్య పద్యాలు చదివారు. సభ తరువాత శ్రీకృష్ణతులాభారం నాటక ప్రదర్శన జరిగింది.

---

జకార్తా, ఏప్రిల్ 20: భారతదేశం సందర్శించవలసిందిగా ఇండోనేషియా అధ్యక్షుడు శ్రీ సోకర్నోకు ఆహ్వానం అందినట్లు ఒక ప్రతినిధి చెప్పాడు. భారత రాయబారి శ్రీ తయ్యబ్జీ దీనిని అందజేశారు. శ్రీ సోకర్నో యీ ఆహ్వానాన్ని అంగీకరించారనీ, యింకా తేదీ నిర్ణయం కాలేదనీ తెలిపారు.

## బాగ్దాద్ కూటం ధోరణి
### కాశ్మీరుపై బ్రిటిష్ భావాల దాపరికం

టెహరాన్, ఏప్రిలు 20: టెహరాన్‌లో జరిగిన బాగ్దాద్ సంధి సంఘం సభ్యులు ప్రతినిధులు అంతా కాశ్మీరు సమస్య విషయంలో మంచి ధోరణి చూపించారని, సమితి తీర్మానాల అనుసారంగా ఈ సమస్య పరిష్కారం కావాలన్న అభిప్రాయాన్ని వెల్లడించారని పాక్ ప్రధాని శ్రీ మహమ్మదాలి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

కాశ్మీర్ పాకిస్తాన్‌లో ఒక భాగమని, దాన్ని భారతదేశం బలవంతంగా ఆక్రమించుకున్నారనికూడా ఆయన అన్నారు.

అయితే ఇదే సభలో పాల్గొన్న బ్రిటిష్ ప్రతినిధి "కాశ్మీర్‌పై ఈ సంఘంలో ఏదో కొంత చర్చ జరిగింది. ఈ సమస్య త్వరగా పరిష్కారం కావడం మంచిదని బ్రిటన్ భావిస్తున్నది" అన్నారు.

"బాగ్దాద్ కూటం రాజ్యాలన్నీ మీ వాదాన్ని సమితిలో బలపరుస్తామని మాట ఇచ్చాయా?" అని పాక్ ప్రధానిని అడగగా ఇలా చెప్పారు: "ప్రపంచం అంతా మా న్యాయాన్ని, ధర్మాన్ని గమనించి మమ్మల్ని బలపరుస్తుందనే అనుకుంటున్నాం. ముఖ్యంగా స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించేవారంతా మమ్మల్ని బలపర్చాలి" అన్నారు.

## ప్రధాని ఇంటిముందు పాక్ పౌరుని అరెస్టు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: ప్రధాని శ్రీ నెహ్రూ నివాసంవద్ద అనుమానాస్పదంగా తిరుగుతుండగా నిన్న అరెస్టయిన పాక్ పౌరుడు హాజీ అమీన్ మహమ్మద్ ఖాన్‌ను యీ నెల 25 వరకు జైలులో వుంచవలసిందిగా నేడు మేజిస్ట్రేటు ఆజ్ఞాపించాడు.

బొంబాయి మాత్రమే సందర్శించడానికి ఇతనికి అనుమతివుండగా ఇతను ఢిల్లీకూడా వచ్చాడు. ప్రయాణపత్ర నిబంధనలను వుల్లంఘించినందుకు ఇతన్ని అరెస్టుచేశారు.

## ఆంధ్ర రాజధాని అభివృద్ధి ఖర్చు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: కర్నూలులో రాజధాని అభివృద్ధికి ద్వితీయ ప్రణాళికలో రూ. 28308000 కేటాయిస్తున్నారు. కాని కొత్తగా ఏర్పడగల రాష్ట్రానికి హైదరాబాదు రాజధాని అయ్యే పక్షంలో కర్నూలులో భవనాల నిర్మాణానికి యింత పెద్ద ఖర్చు అవసరం కాకపోవచ్చు అని కేంద్ర ప్రణాళికా సంఘం, రాష్ట్ర ప్రభుత్వం, కూడా గుర్తించాలని ఉప ఆర్థిక మంత్రి శ్రీ బి.ఆర్. భగత్ నేడు లోక్ సభలో శ్రీ అవినాశలింగం చెట్టియార్‌కు చెప్పారు.

"కర్నూలు పట్టణం, పరిసరాల అభివృద్ధికి ఆంధ్ర ప్రభుత్వానికి ఋణం ఏమియివ్వలేదు. సుమారు 288 లక్షల 8 వేల వ్యయం కాగల పథకాలను ఆంధ్ర ప్రభుత్వం సమర్పించింది. వీటిని ప్రణాళికా సంఘం పరిశీలిస్తోంది. హైదరాబాదు రాజధాని కాబోతున్నది గనుక ఆంధ్ర ప్రభుత్వం సమర్పించిన పథకాల పరిశీలన సందర్భంలో ఆవిషయం దృష్టిలో వుంచుకుంటాం." అని శ్రీ భగత్ వివరించారు.

## ఆడ పోలీసుల అర్హతలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: ఆడ పోలీసుల కనీస అర్హతలకు మగ పోలీసులకు అర్హతలకు వ్యత్యాసం ఉన్నది. పురుషులకు పోలీసుగా నమోదు అయ్యేటప్పుడు ఉండాల్సిన కనీసవయస్సు 18 సంవత్సరాలు. ఆడపోలీసులకైతే యీ కనీస వయస్సు 30 సంవత్సరాలని లోక్ సభలో దేశీయాంగశాఖ ఉపమంత్రి శ్రీ బి. యన్. దాతార్ తెలియజేశారు. ఇక విద్యార్హత విషయంలో పురుషులు ప్రాథమిక తరగతికి పైగా చదివి ఉండాలి. స్త్రీలకు హిందీ ఉర్దూల పరిజ్ఞానం అవసరం. శారీరకంగా పురుషులకు కొన్ని కనీస యోగ్యతలు ఉన్నాయి. స్త్రీల విషయంలో అవయవ సౌష్ఠవం బాగా ఉంటే చాలు.

## మద్రాసులో ఖాదీ అభివృద్ధి శిక్షణ

మదరాసు, ఏప్రిలు 21: మదరాసు నగరం ఖాదీ అభివృద్ధి సహకారసంఘం త్యాగరాయనగర్‌లోని చర్కా ప్రచారసభ ఆవరణలో యీనెల 26 నుంచీ నూలు వడకడంలో శిక్షణ ఇవ్వటానికి తరగతులు నడుపుతారు. ఈ తరగతులు ఉదయం 7-30 నుంచి 10-30 వరకూ మధ్యాహ్నం 2-30 నుంచి సా. 5-30 వరకు జరుగుతాయి.

ఈ చేతిపనిలో శిక్షణ పొందదలచేవారు తమ పేర్లను పై చిరునామాలోగా సంఘ కార్యాలయంలో తెలియజేయాలి.

## పాక్ విమానంపై పఖ్తూన్ జాతీయవాదుల కాల్పులు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: పఖ్తూనిస్తాన్‌లోని ముసాఖేల్ ప్రాంతంపై పోతున్న పాకిస్తాన్ విమానాలపై పఖ్తూనిస్తాన్ జాతీయవాదులు మార్చి 31-వ తేదీన కాల్పులు జరిపారు. దీని ఫలితంగా ఒక విమానం ధ్వంసమైపోయింది. విమానసిబ్బందిలో ఒకరు గూడా బతికి బయటపడలేదని ఆఫ్గన్ వార్తా సంస్థ తెలియజేసింది.

మరోజట్టు జాతీయవాదులు షేక్ విసల్, కాకా ప్రాంతాల మధ్య టెలిఫోన్ టెలిగ్రాఫ్ తీగలను తెంచారని, బోలన్ కనుమలో ఒక పాకిస్తాన్ సైనికకేంద్రంపై దాడిచేశారని వార్త.

## కర్నూలు ఫుట్‌బాల్ 'డ్రా'

కర్నూలు, ఏప్రిల్ 21: ఇక్కడ జరుగుతున్న కస్తూర్యా స్మారక ద్వితీయ వార్షిక ఫుట్ బాల్ పందెముల రెండవ రౌండులో కర్నూలు ఫుట్ బాల్ సంఘం జట్టుకు, హజారీ క్లబ్బు జట్టుకు (హైదరాబాదు) రెండోమారు జరిగిన పోటీకూడా ఫలితం తేలక డ్రా అయింది.

ఈ ఆట మళ్లీ 22వ జరుగుతుంది.

జట్టు ఆటగాండ్ర పేర్లు: హజారి ఫుట్ బాల్ జట్టు—అష్రఫ్, ఈజన్ అలీ, సర్దార్ అలీఖాన్, అసగర్, కరీం, నిస్సార్, ముక్బుల్, మహమూద్ జూనియర్, శ్యాము, మహమూద్ సీనియర్ సమద్.

కర్నూలు ఫుట్ బాల్ జట్టు: చెన్న కేశవులు, పార్థసారథి, శేరుద్దీన్, సుబ్బయ్య, ఈశ్వరయ్య, పన్నీఖాన్, గులాం అహ్మద్ ఖాన్, వాజీద్ జూనియర్, టామి, రహమాన్ ఖాన్, ఖాలీద్.

అంపయరు సి. కే. నాయుడు.

## పురపాలక సంఘాల ప్రధానాధికారుల కృషి
### సమన్వయం చేసే విషయం పరిశీలనకు సమావేశం

కర్నూలు, ఏప్రిల్ 20: పురపాలక సంఘాల కార్యనిర్వాహాధికారులైన ఇంజనీరు, కమీషనరు, ఆరోగ్య శాఖాధికారులు తమ ఉద్యోగ విధులను వీలైనంత బాగా పరస్పర సహకారంతో సమైక్యతతో నిర్వర్తించడం ఎట్లాగనే విషయాన్ని పరిశీలించేందుకు, అందుకు సంబంధించిన శాఖల కార్యదర్శులు, ప్రధానాధికారుల సమావేశం ఒకటి ఏర్పాటు చేయాలనుకుంటున్నామని స్థానిక పరిపాలనాశాఖ మంత్రి డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావు పత్రికల ప్రతినిధులకు చెప్పారు.

ఈ ముగ్గురు అధికారుల ఉద్యోగ విధులకు సమన్వయం కుదిర్చే సమస్య చాలాకాలంగా ప్రభుత్వ పరిశీలనలో వున్నది.

ఈ సమస్యకు సంబంధించిన ప్రధాన ఇంజనీర్లు, శాఖల ప్రధానాధికారులు, కార్యదర్శులు సమావేశంలో పాల్గొంటారనికూడా మంత్రి చెప్పారు.

## శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానం

మదరాసు, ఏప్రిల్ 21: శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానం శ్రీరామనవమి ఉత్సవాల సందర్భమున కొత్వాలుచావడిలో 22 సాయంత్రం 6 గంటలకు శ్రీ రాజమహేంద్రం జి. సుందరం భాగవతులు శ్రీరామకృష్ణ నామమహిమ హరికథా కాలక్షేపం జరుపుతారు. న్యా॥ డబ్ల్యు. యస్. కృష్ణస్వామినాయుడు అధ్యక్షత వహిస్తారు.

23 సాయంత్రం 6 గంటలకు కుమారి ఇందిరాదేవిచే "సీతాకళ్యాణము" హరికథ కాలక్షేపం. అధ్యక్షుడు శ్రీ యం. రాధాకృష్ణపిళ్ళై.

---

మదరాసు, ఏప్రిల్ 21: శ్రీ టి. రంగనాథ మొదలియార్‌ను దక్షిణ రైల్వే ప్రాంతీయ సలహా సంఘ సభ్యునిగా దక్షిణభారత వాణిజ్య సంఘం ఎన్నుకొన్నారు. వారికి ఆ సభ్యత్వం రెండేళ్ల వరకు ఉంటుంది.

# ఆంధ్రపత్రిక ✦ సారస్వతానుబంధం

1956 సం॥ ఏప్రిల్ 22- వ తేదీ ఆదివారము


కథానిక

## వెలుగుబాటలు

— శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

దొడ్డి వసారాలో పడక కుర్చీలో పడుకుని, సుజాత వేస్తున్న ముగ్గుల్ని వోరకంటితో చూస్తున్నాడు మధు. అప్పుడప్పుడే కొట్టంలోంచి పందులు చేసుకుంటూ మెల్లి మెల్లిగా వచ్చి పడుతున్న మార్చిలేఠ కోల తెల కాంతిలో సుజాత ముఖం వికసించింది. మధు చిరునవ్వు నవ్వాడు. సుజాత వక్క చరుగులో పాలేరు యిచ్చిన పాల చెంబు తీసుకుని యింట్లోకి వెళ్లిపోయింది.

ఏం బాబుగారు పప్పన్నం యెప్పుడు పెట్టిస్తారో ... అంటూ ముసిముసి నవ్వులు నవ్వాడు పాలేరు, ఆవు, దూడను లాక్కుపోతూ.

కాంతమ్మ కాఫీ తెచ్చియిచ్చింది. మధు అట్లాగే చూస్తూ పడుకున్నాడు.

'పెళ్లి దగ్గరకొస్తున్న కొద్దీ, సుజాతకు మరీ సిగ్గు యెక్కువైపోతోందిరా. కాఫీ నన్ను తీసుకువెళ్ళి యివ్వమన్నది' అన్నది కాంతమ్మ.

మధు వులిక్కిపడ్డాడు ఆ మాటలకు, సుజాత తలుపు ప్రక్కనుంచి యింట్లోకి వెళ్ళిపోయింది.

'ఏమిటిరా ఆలోచన. దీనికి అంతూ పొంతూ యేమి లేదేమిట' కాంతమ్మ, మధును చూస్తూ అడిగింది.

వంక అదోవిధంగా వర్ధనమ్మ చూసింది.

'నాకేం తెలుసు మధు సంగతి' పక్క కసురు కసురుకున్నాడు రాజారావు.

'మధు పుట్టినప్పటినుంచి నాకు తెలుసు. నాన్నతో అమ్మతో పోట్లాడి బస్తీలో కాపరం పెట్టంగానే నీకేదో తెలుసు అనుకుంటున్నావేమో' వర్ధనమ్మ రెట్టింపాడుపుగా మాట్లాడింది.

'మళ్ళీ సాధింపు మొదలు పెట్టావు. అందుకనే ఇక్కడికి రావటంలేను' రాజారావు ఆ ధోరణిలోనే సమాధానం యిచ్చాడు.

'ప్రొద్దు మాపుందు గంటలు వేసినట్లు పెట్టామనుకుంటున్నావేమో వలుగుల్లో తిరగగల మనిషి. కష్టం సుఖం యెరుగున్న అబ్బాయి. నీమాదిరిగా బస్తీలో కూర్చుని ఒక్క వుత్తరం ముక్క వ్రాయటంలేదు డబ్బు కొట్టంగానే డబ్బుమీదే అమ్మేని డబ్బు పంపమని' అంటూ వర్ధనమ్మ యింటిలోనికి వెళ్తుగా పోయింది.

రాజారావు కోపం ఆపుకోలేక పోయాడు.

'నా ఆస్తి నేను తినటానికి వాడు హక్కు లేదన్నమాట. అట్లా అవుతే నా భాగం నేను తీసుకుపోతాను' రాజా ...

'అంతవరకూవుంది యెక్కడో. గంగయ్య తిడాఖా తెలీదన్నమాట. రామస్వామిని పట్టపగలు కూనీచేయించి ... పీను ... మనసంగతి...' గంగయ్య మీసం మెలేశాడు.

'దంపటకు నేడి మొదట్లో ఆలోచించవలసిన విషయం కాదు. అది చివరిమెట్టు...' రాజారావు ముక్తసరిగా పూరుకున్నాడు.

గంగయ్య మళ్ళీ రాజారావుకైపుకు ప్రశ్నార్థకంగా చూశాడు, 'ఏం లేదు మనం చేయాల్సింది, రేపు మధు మీటింగు చెడగొట్టాలి. ...'

(6 వ పేజీ చూడుడు)

హైదరాబాదు రాష్ట్ర సంస్కృతి విద్యామండలికి ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణరావు ఏప్రిల్ 17న ప్రారంభోత్సవం చేశారు. దీనికి తిరుపతి దేవస్థానం దోహదం చేసింది. ప్రారంభోత్సవానికి ఆంధ్ర దేవాదాయ మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి అధ్యక్షత వహించారు.

భగవద్గీత:

## 'అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్'

[రచన: హసజ]

యుద్ధోత్సాహులైన తన వారు, ...

పుమీద ఉంచకుండా, అందు కవసరమయిన విషయాలపై ఉంచకుండా దృష్టి అన్యథా ఎందుకుంటుంది? ...

(8 వ పేజీ చూడుడు)

## కవిత్వంలో పోలికలు

[శ్రీ అంబటిపూడి వెంకటరత్నం]

కవిత్వములో పోలికలను కనుగొనుట యందు అనేకములైన తీరులు కలవు. రూపానుకరణము, భావానుకరణము అను రెండు విధానములను సాధారణముగ చెప్పవచ్చును.

రూపానుకరణమునందు నడక ననుసరించుట, శబ్దములను ఎత్తి వాడుకొనుట, భావానుకరణమునందు భావమును కొంచె మనుసరించుట, కేవల మా భావమే తనదిగా వాడుకొనుట, అను వాదములయందు చేయు. అటువి ఇచ్చటికి తెచ్చుకొనుటలో మెత్తము గ్రహించుటకూడ కలదు. అది మనాలము అంటుకొనిపోవు అనువాదకుని అభిరుచినిబట్టి యుండును. అట్టివి మనము పోలికలనుట కుదరదు. స్వతంత్రముగా సాగిన కృతులలో పరుల రచనల పోలికలు కనబడినప్పుడు ఇది ఫలానావారి రచననుండి గ్రహింపబడినదని చెప్పవచ్చును. ...

O Woman! lovely woman!
nature made thee
To temper man, we had
been brutes without you.

'అందమె ఆనందం,
ఆనందమె జీవిత మకరందం'

అను పాటను వినుటతోడనే Keats వ్రాసిన

'A thing of beauty is a joy for ever' అను వాక్యము స్ఫురించవచ్చును.

వేదులవారి రచనలలో టాగోరు రచనల కనువాదములు తోచును. ఒక చిత్రము. వేదుల భావములను తెనుగు నుండి తెనుగులోనికి అనువదించిన పన్నియో కలవు. ఆయన 'నను కొంతు' అనుదానికి నకలు పద్యములు పాపయ్యశాస్త్రి పద్యముల కలవు. ఇటీవల జాస్తి వెంకటనరసయ్య 'పుష్పవాంఛ' అను పేరుతో అదే భావమును ...

మైనను, తనుక్కన మెఱయు కెంపాల తెలవంటి కవితారేఖలు దివ్యములౌను. ఏ రసమో అను విచారణ చేయు. ఏరసనుయినను రసమయమైన వాక్కు చేయు. రమణీయార్థప్రతిపాదకమైన ఆ శబ్దములు చేరి చూపించుట విమర్శకధర్మము.

'కారు మొయిల్లే కొటుక పో
కల విల్గకు తమాల వాటి చే
దారియు కానరాదు నెల
తా యెటువోయెద వర్ధరాత్రి—'

అను కృష్ణశాస్త్రిగారి పద్యమును జూచుటతోడనే గీతగోవిందము నందలి ప్రథమ శ్లోకము.

'మేఘై ర్మేదుర మంబరం వనభువ
శ్శ్యామా స్తమాల ద్రుమై:
నక్తం భీరురయం'

అనుమానము లేకుండగ మనోవీథి మెఱయును. ...

'ఎండలో మాడిపోవు లేయిఘరులరసి
ఏన్నునదుల ప్రేమోదంత
మెవ్వడెఱుగు'

అబ్బూరి వారి

'కడలెఱుంగగజాలని కలుఘరులు
హృదయపాథానవి మ్మొరిగినదుండ
అక్రియ మొసంగు నావులాయ
మవు నీవు'

అనునదియు

విశ్వనాథవారి

'తల్లిలో రెక్కలో దాగి......'

అను దేవరాజులోని పద్యమును, ఇంక నిట్టి కొన్నింటిని జూపి, ఇది చక్కని ప్రయింకల్పిత ఖండమునైన మఱువరానిదనియు, అట్టి కావ్యములను తీసి చూపుటయే విమర్శకుని ధర్మమనియు జెప్పెయుంటిని.

కావ్యమెంత దీర్ఘమైనను ప్రాస్య ...

The dew drops 'At morn glitter on the Spider's webs' ... Samuel Taylor Coleridge వ్రాసిన 'The Picture' ... (1770-1850) ... Coleridge ... Gray వ్రాసిన Elegy ... Elegy ... Fashion ...

(9 వ పేజీ చూడుడు)

# వెలుగుబాటలు

5వ పేజీ తరువాయి

వీరి విషయంలో బాగా అనుభవమే. ఇంత తియ్యగా మధుగారు మాట్లాడుతున్నారంటే, పదాలకుండే అర్థాన్ని బట్టి, మనుష్యుల తత్వాలు నిర్ణయించే మీ బోటి ప్రజలు మోసపోతున్నారంటే ఆశ్చర్యపడవలసిన విషయము యేమీ లేదు. ఇలాంటి అన్యాయం జరుగుతూ వుంటే సహించి వూరుకోలేక మీ ముందర నిలబడి నాలుగు ముక్కలు చెప్పిపోదామని వచ్చాను. అంతేకాని యితరులను విమర్శచేద్దామని నేను రాలేదు. ఇంతకీ యీ సభ వుద్దేశం మీకు పూర్తిగా తెలియదు. మిమ్మల్నందర్నీ సంఘటితపరచి యేదో వరిగపెడతానంటే మీరు ఆకాశంవైపు చూస్తూ కూర్చున్నారు. ఈ మధ్య వీరి పార్టీ బలము పన్నగిలిపోతోందనే విషయము మీ అందరికీ తెలిసిందే. వాటి కారణాలు యీ మీటింగులో ప్రస్తావించటం అప్రస్తుతం. అందువలన గ్రామాన్నంతా సంఘటితపరచాలంటే లేని పార్టీని సంఘటిత పరచాలనేదే మధుగారి వుద్దేశం...' రాజారావు వుపన్యాసం పూర్తిచెయ్యకముందే సభలో గోల ప్రారంభమయింది.

'కాదు'కాదని కొందరు, 'ఖబడ్' అని కొందరు మీటింగులో అరవటం మొదలుపెట్టారు. సభలో కోలాహలం హెచ్చిపోయింది. ఎవరు చెప్పినా పట్టుమనే సావకాశము కనిపించటం లేదు. ఆ సభలో యెవరికి యిష్టంవచ్చినట్లు వాళ్లు మాట్లాడుకుంటూ గలాభా చేస్తూ లేచిపోయారు.

* * *

సుజాత కాంతమ్మలు బిక్కమొహం వేసుకుని యింట్లో గదిలో యేదో విచారంగా వకళ్లతో వకళ్లు యేదో చెవుదామనుకుంటున్నట్టు వుద్విగ్నులవుతున్నారు. కాని యెవరికివాళ్లు సందేహంగానే వుండిపోతున్నారు.

'అత్తయ్యా....' అంటూ బిక్కమొహం వేసుకుని సుజాత, కాంతమ్మ మొహంలోకి చూసింది.

'ఇంకాక వాళ్ళ కూరమ్మ 'మనో కులుకుతున్నావులే, నిన్నే మిచేసుకోడు, బాలవుంది' అన్నది నాకేమిఅర్థంకాలేదు...' అంటూ చిన్న మొహం వేసుకుని సుజాత, కాంతమ్మదగ్గరగా నడిచింది.

'ఆ...నీ దాకా వచ్చిందా యీ సంగతి' కాంతమ్మ ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

మధుకిక ఆలోచనల్లో మునిగి వున్నాడు. రాజారావుకు తనమీద యింతకసి యెందుకు యేర్పడిందో అర్థంకావటంలేదు. బహుశా గంగయ్య పార్టీవారు రాజారావును పంపించి వుంటారని అనుకుంటున్నాడు.

'ఒరేయి అబ్బాయి యిదెక్కడి పాపంఅంట. నేను యిట్టే బైటకు వెళితే బాలట బాల యెవరో అమ్మాయికి నీకు ముడిపెడుతున్నారు.' అన్నది కాంతమ్మ సందేహిస్తూ.

'అమ్మా—ఏమన్నావు......బాలకు నాకూనా...' అంటూ ఉలిక్కిపడ్డాడు మధు.

'అవును బాల కిష్టయ్య గారి అమ్మాయి. ఆ వంశంలో అలాంటి ఆడది పుట్టాలిసిందికాదు. అందువలనే బాలను యేదోవిధంగా అవమానంచేద్దామని వేస్తున్నయెత్తు. అంతకంటె యేం లేదు. వాళ్లికవి తీర్చుకోవటానికి నేనొకన్ని వున్నానుగా. ఇదీ ఒక ప్రాత్రయిత్తే కానీ చూద్దాం.' గంభీరంగానే మధు తల్లివైపుకు చూశాడు.

'అవునురా యేమెత్తో యేంకర్మమో అట్లా అభాండాలువేసే వాళ్ళనోర్లు కట్టేటట్లుగా యేదోవక ముహూర్తాన సుజాతతో ముడిపడేందంటె సరిపోతుంది...' అన్నది కొంచెం అథారిటీగా కాంతమ్మ.

ఎవరో యేదో అపనింద మోపారని మనం భయపడిపోతే, యింకా మనం సాధించగలిగిందేముంటుందంట...! మధు అతి తేలికగా తీసుకున్నాడు తల్లి వుద్దేశాన్ని.

కాంతమ్మ మారుమాటాడలేదు. సరాసరి గదిలోకి వెళ్ళిపోయింది. సుజాత తల యెత్తకుండానే సావిట్లోకి వెళ్ళిపోయింది.

సుజాతతో ఏదో చెవుదామనుకున్నాడు మధు. ఇంట్లోనే వుంటున్నా కూడా అవసరమైనప్పుడు తప్పనిసరిగా ముక్తసరిగా మాట్లాడటమే కాని, మధు యింటివరకు చనువుగా తీరికగా సుజాతతో సంభాషణలోకి దిగనేలేదు. సుజాతకూడా అంతకంటె సిగ్గు బావయెదుట యేమైనా విషయాలు మాటాడటం అంటె. ఎట్లాగైనా చనువు చేసుకుని సుజాతవున్న గదిలోకి మధు వెళ్ళాడు. సుజాతకు యెందుకనో వక్కసారిగా భయము వేసినట్లనిపించింది. మధు వచ్చాడని తెలిసికూడా సుజాత గదిలో యేదో పనున్నట్లు నటిస్తోంది. ఈ విషయాన్ని గ్రహించిన మధు మెల్లగా సుజాతదగ్గరకు అడుగులు వేస్తూ, 'నా మీద నమ్మకంవుంచు, ధైర్యంగా యిలాంటి అపనిందలు యెదుర్కొంటూ రావాలి. అంతకంటె నేను నీకు చెప్పేదేమీ లేదు' అన్నాడు.

కంటి చెమట పమిటకొంగుతో తుడుచుకుంటూ, అనుకోకుండా మధు వంకచూసి చిరునవ్వు నవ్వింది.

మనసుకు తృప్తి కలిగింది. వెంటనే గదిలోంచి బైటకు వచ్చేశాడు వుత్సాహంగా.

'మధు బాబుగారు...' అంటూ యెంతో నీరసంగా అన్నది వాకిట్లో నుంచున్న బాల, గదిలోంచి వస్తున్న మధును చూసి.

మధుకూడా తలవంచేసుకున్నాడు.

'రాజారావుగారు యేదిచెపితే అది నమ్మేస్తున్నారు గంగయ్య బాబాయి.

ఆయన యెంతంటె అంత మా నాన్న... అని బాల తలవంచుకుంది.

'ప్రస్తుతం అంతా నాకూ తెలిసింది.' అన్నాడు మధు పెద్ద నిట్టూర్పు విడుస్తూ.

ఇంట్లోంచి కాంతమ్మ బైటకువచ్చి, బాలను చూసి తటాలున ఆగిపోయింది.

"గంగయ్య దుండగాలు రోజురోజుకు హెచ్చిపోతున్నాయి. ఈ విధంగా ప్రచారం చేస్తాడని అనుకోలేదు..." అన్నది కాంతమ్మ, బాలను చూస్తూ.

బాల నోటివెంబడి మాటలేదు. కాంతమ్మకూడా వక్కక్షణంపాటు అట్లాగే నిలబడిపోయింది.

పున్నయ్య పరుగెత్తుకుంటూ వచ్చేశాడు.

'నువ్వు యిక్కడ వున్నావని తెలిసింది. పరుగెత్తుకుంటూ వచ్చాను, ఇలాంటి అపవాదులకు లెక్కచేసే ఘటంకాదు యీ పున్నయ్య. ఈ బాల యెప్పటికైనా మా యింటికి రావాలిసిందె. ఇప్పుడే తీసుకువెళ్లిపోతాను...' అన్నాడు పున్నయ్య.

బాల సిగ్గుతో తలవంచేసుకుంది.

'మీ యింటిదగ్గర యిక్కడ వసేపుంచటం యేమంత మంచిదికాదండి. వాళ్లు చేస్తున్న ప్రచారానికి యిది బలమవుతుంది బాబు...' అన్నాడు పున్నయ్య.

'మనస్సు సాక్ష్యంకాని, మనిషిని చూసి భయపడితే యెన్నాళ్లు నెగ్గుతాం పున్నయ్య.' అన్నాడు మధుయేదో ఆలోచిస్తూ.

అమాటవుతే సత్యమేకాని ప్రజలు మాయమాటల్లో పడే విషయాన్ని నిమిషంలో గ్రహిస్తారండి. మంచిని కనిపెట్టటానికి చాలారోజులు పడుతుంది. మన కెందుకు వచ్చిన కీచులాట. మా యింటికాడ వుండంటె యెవరైనా నోరుకదిపితే ముక్కలు విరగతన్నుతా' ఏమనుకున్నారో...'పున్నయ్య ప్రతాపాన్ని ప్రదర్శించుకున్నాడు.

అందాక, యెందుకు వస్తుందిలే... 'మధు తేలికగా ఆలోచిస్తున్నాడు.'

'మీకు తెలీదండి. గంగయ్యకంటె కూడా నరసయ్య మహాకాలాంతకుడు. తలలు మార్చేరకం. ఒకబనీను, పంచ కట్టుకుని బజార్లో తిరుగుతూ వుంటే అమాయకపు రైతులాగా కనిపిస్తాడేమోకాని, రాజారావుగారు చెడిపోవటానికి మూడువంతులు నరసయ్యం బవమ్మండి. రాజారావుచేత బస్తీకాపరం పెట్టించాడు. ఈవాడు వూళ్లో వేశ్య కాపరం పెట్టించాడు...'పున్నయ్య ఇంకా చెప్పటం పూర్తికాలేదు.

'పాపం పుణ్యం భగవంతునికెరుక. మనం నోట అనకూడదు కాని రాజారావుగారి రెండోపిల్లాడు అచ్చగా నరసయ్య పోలికేనండి. పాపం ఆయన ఇంటికి అన్నివిధాలా శని పట్టిపడిందండి...'పున్నయ్య నిజంగా రాజారావుపట్ల సానుభూతి ప్రదర్శించాడు.

'నాకూ ఇప్పుడిప్పుడే అన్నీ వినిపిస్తున్నాయి....' మధు నెమ్మదిగా అన్నాడు.

'అవులే నీమీదికి యేమిరాదుగదా' అడిగాడు మధు ఆదుర్దాగా.

'ఏమిటండో యీ పున్నయ్యంటే మీకుకూడా సరిగ్గా తెలీదల్లేవుంది. మన యవహారంలో జోక్యం చేసుకున్నాడంటే ముక్కలు విరగతన్నటమే. తర్వాతమాట మంచీమ. అసలే నేనంటేనే భయపడిచస్తారులెండి. మేము వస్తామండి...' బాలనుకూడా తీసుకుని వెళ్లిపోయాడు పున్నయ్య.

మధు యేవో కాగితాలు చూచుకుంటూ గదిలోనే వుండిపోయాడు. ఈ గండం గట్టెక్కిందనుకుంటూ కాంతమ్మ యింట్లోకి వెళ్లిపోయింది.

* * *

'ఫలానావారి కుటుంబం అంటె యెంతో గౌరవం యెంతో ప్రతిష్ఠ. అంతా మంటలో కలిపేస్తున్నాడే. చూస్తున్నావా ఆస్తి యేవిధంగా తగలబడిపోతోందో' అంటూ కూర్చుంటే రాసులు రాసులు కరిగి పోతాయని వూరికే అన్నారా మరి. ఇవ్వాళ నరసయ్య వచ్చినా, రేపు ఇంకో పుల్లయ్య వచ్చినా, మనమొహాలు చూసి ఎవరూ రావటంలేదు. మనపొలం, మనయిల్లు వాకిలి చూసి వస్తున్నారు. అలాంటి వాళ్లందర్నీ వకకంట కనిపెడుతూ వుండాలి. ఖర్చులా మనకు ఎక్కువయిపోతున్నాయి. రవేమో ఈ యేడాది బస్తీవెళ్లి చదువుకోవాలి...' వర్ధనమ్మ యింకా పూర్తిచెయ్యకముందే రాజారావు కల్పించుకున్నాడు.

'బస్తీ వెళ్లి చదవాలంటే మాటలా, అయినా యిప్పుడు చదువుకున్న వాళ్లు మాత్రం యేం చేస్తున్నారు కనుక.'

'అందుకని చదువు మానేస్తారా. ఎవరి అదృష్టం ఎలాంటిదో యెవరు చెప్పగలరు.' వర్ధనమ్మ రవి చదువును సమర్థించింది.

'ఎట్లా చదువుతాడో చూస్తానుగా నేను చిల్లిగవ్వ ఖర్చుపెట్టితే ఇల్లు తగలబడిపోతోందోఅని గోలపెట్టేస్తావు. పిన్ని బస్తీ పంపించి ఉంచటం వీలు కుమ్మరించాలంటే మాత్రం చాలా సంతోషమే...'

'నువ్వు ఏమనుకున్నా, నాకు నువ్వు వకటి, రవి వకటికాదు. నిన్ను చదువుకోమని యెవరైనా అన్నారు కనుకనా నువ్వు మానేసింది. నీకు వాంట్లో ధ్యాస లేదు. మానుకు కూర్చున్నావు. నేనేం చేస్తాను...'

'నువ్వు అనటానికేంలే అట్లానే అంటావు. ఆమ్మకు ఖర్చుతో చదువుకోవటానికి పిల్లేదు పిల్చింది(?) చెప్పేస్తున్నా' రాజారావు నిక్కచ్చిగా మాట్లాడాడు.

'నేను అంత మనిషిని నేను బతికి వుండగానే నువ్వు యిట్లా అంటూంటే, నేను పోయిన మరునాడే తమ్ముని బతకనిస్తావుటా. రవే భాగాలు పంచుకోంది. ఆడపడుచు వస్తూ వుంటుంది. ఎంత పెద్దయినా పుట్టింటిమీద ఆశంటూ వుంటుంది. నాకూ వక భాగము వుండాలిసిందే...' వర్ధనమ్మ తీవ్రంగా అనేసింది.

రాజారావు యేమీ మాట్లాడలేదు.

రవి తలవంచుకుని గదిలోకి వెళ్ళిపోయాడు.

'ఒరేయి రాజా, పిల్లను చూసి చాలా రోజు లయింది. నేను రేపు అమ్మాయి దగ్గరకు వెళుతున్నాను. మళ్ళీ నేను వచ్చే వేళకు నువ్వెక్కడ పలో వుంటావో వుండవో అని చెపుతున్నా...' అన్నది వర్ధనమ్మ.

రాజారావు మెదలకుండా గడప దాటాడు.

'రవీ వీడు నిన్ను చదువుకోనీడు. నీ భాగం నువ్వు తీసుకుని నీ యిష్టము వచ్చినంతవరకు చదువుకో. వీడు బల్లగా మాస్తే మనకేమి యిబ్బందిలేదు. ఈ వుమ్మడిగా అట్టే పెడితే యీ వున్నది కాస్తా కూడా వూరకేపోతాదేమో కూడా...' వర్ధనమ్మ చెపుతూ పోతోంది.

రవి మెదలకుండా వింటూ కూర్చున్నాడు.

రవి జట్కా బండి వెంకటసామికి కబురు చేశాడు తన తల్లి రేపు వూరు వెళుతోంది స్టేషనుకు వెళ్లాలి బండీ తెమ్మని.

బండి వచ్చి వాకిట్లో ఆగింది మర్నాడు. రవికూడా స్టేషనుదాక తల్లితోపాటు వెళ్ళాడు. రైలు కనిపించకుండా పోయినంతవరకు ఆగి, ఆ బండీ యెక్కే రవి యింటికి వచ్చేశాడు.

* * *

అత్తిగారు క్రొత్తగా యీ వూరు రావటం. స్టేషన్లో దిగంగానే పరిచయస్తుని మొహం వక్కటీ కనిపించకపోతే భయపడిపోతుందని వెళ్ళాలిసిన చోటుకు వెళ్ళటంకూడా మానేసి హడావిడిగా అల్లుడు స్టేషనుకు పరుగెత్తుకువచ్చాడు. తీరా కనుక్కుంటే బండి గంట లేటని తెలిసింది. ఆ గంటలో తాను వెళ్ళాలిసిన చోటుకు వెళ్ళి పని పూర్తిచేసుకుని రాలేడు. అది అతనికి తెలుసు. ఇంటికి వెళ్ళి రావటానికి బండీ ఖర్చులు దండగతప్ప యింకో యేమీ వుపయోగం కనిపించటం లేదు. కాలం వృధాపుచ్చుతూ యేపనీకూడా చెయ్యకుండా కూర్చోవాలంటె అతనికి విసుగ్గా వుంది. నాలుగుసార్లు రిస్టువాచి చూసుకున్నా పెద్దముల్లే కదులుతున్నట్లు కనిపించలేదు. విసుగ్గా ప్లాటుఫారం ఆ చివరనుంచి యీ చివర దాక రెండు మూడు సార్లు పచార్లు చేశాడు. పుస్తకాల షాపు తెరుస్తాడేమోనని ఒకటి రెండు సార్లు అటువైపుకు వెళ్ళాడు. ఇంకా అరగంట ఆగాలని తెలిసింది. రైల్వే హోటలులో ప్రవేశించి రెండుసార్లు కాఫీత్రాగాడు ఎదురుగున్న ఘటంకోసం కరువువాచిన మొహంలాగ గ్రుడ్లు పెద్దవిచేసి అన్ని చోట్ల చూశాడు. అలాంటి జీవుడు అక్కడకు రానేలేదు. గడియారము ముల్లు అతనికి కొంచెం వుత్సాహాన్ని కలిగించింది. సిగ్నలు కూడా వంగి పోయింది. దూరాన పొగ తన అత్తిగారు వస్తున్న రైలుబండీ చిహ్నమే అని సంతృప్తి పడ్డాడు. కళ్ళవెంట కేకపెట్టుతూ, రివ్వుమంటూ, రైలుబండీ ప్లాటుఫారం దగ్గరకు వచ్చి నిలబడిపోయింది.

ఆ కేకలు, ఆ అరుపుల ధ్వని తల వాచిపోయింది అతనికి. ఇంజను దగ్గరకు ప్రారంభించి, చివర పెట్టె దాకవరకే ఆ దుర్దాగా వెరపార చూశాడు. అత్తిగారు యెక్కడా కనిపించలేదు. వళ్లు తగలడి పోయింది. అతనికి వచ్చిన టెలిగ్రాం మీద మండి పడ్డాడు. మొహం చిటచిట లాడించుకుంటూ స్టేషను అవతల పడ్డాడు. తీరా మాస్తే జేబులో పెన్ను లేదు. గబగబా వెనక్కు తిరిగి మళ్ళీ ప్లాటు ఫారం దగ్గరకు వెళ్లిపోయాడు. ఒక్క క్షణం ఆలోచించిన తర్వాత నిష్ప్రయోజనమని తెలుసుకున్నాడు. నిప్పులు కక్కుకుంటూ తన ప్రాంగంచోటుకు వెళ్లిపోయాడు. మళ్ళిసాయంత్రం అరింటికి గాని కొంపకురాలేదు. వసంతి సంతోషంతో తలుపు తీసింది. శేఖర్ మొహం చిటచిట లాడించుకుంటూ ధూకుడుగా లోపలకు వెళ్ళిపోయాడు. వసంతి అడుగుల్లో అడుగులు వేసుకుంటూ శేఖర్ వెనకాలే వెళ్ళింది. శేఖర్ కస్సుమన్నాడు.

మీరు స్టేషనుకు వెళ్లకపోతే మా అమ్మ రాలేదనుకున్నారా, పక్కింటి పార్వతమ్మగారుకూడా ప్రక్క స్టేషనులో ఎక్కిందట. వాళ్ళ కుటుంబముతో కలిసి వచ్చింది. ప్రొద్దున బండికే...' అన్నది వసంత కులుకుతూ.

ఆశ్చర్యంగా శేఖర్ వసంత వైపు చూశాడు.

"ఏమిటే అట్లా చూస్తారు" అంటూ వసంత అతి తేలికగా అడిగింది.

"ఏంలేదు ... నాకు చేతనయినంత ప్రయత్నం చేశాను. మీటింగు పూర్తి అయ్యేటప్పటికే రైలు వేళ దాటిపోయింది. అందువలన ఎక్కడానికి వీలుపడలేదు. అయినా నీతో ముందరే చెప్పానుగా నావీలునుబట్టి చూస్తానని. ఇప్పుడు చాలా ముఖ్యమైన ఒక కాగితము కనిపించటంలేదు. దానికోసం వెదుకుతున్నాను. కొంచెం చూసి పెడుదూ ...' శేఖర్ ఆదుర్దాగా అటూ ఇటూ చూస్తున్నాడు.

దొడ్లోనుంచి వస్తున్న వర్ధనమ్మను చూసి 'నమస్కారమండి' అన్నాడు శేఖర్.

వర్ధనమ్మ త్రుళ్ళిపడి యథావిధిగా ఆశీర్వదించింది.

'నా దగ్గిర అడ్రసువుంది. దాన్ని పట్టైనా నేను సూటిగా యింటికి వచ్చేదాన్ని' వర్ధనమ్మ బింకంగా అన్నది శేఖర్ స్టేషనుకు రాకపోవటానికి కారణము చెపుతుంటే.

కుశల ప్రశ్నలే షుమారు గంటదాకా నడిచినాయి.

మధ్యాహ్నం భోజనాలయినతర్వాత సావకాశంగా మేడమీద కుర్చీలో కూర్చున్నారు వర్ధనమ్మ, వసంతలు. కబుర్లకు అంతూ పొంతూ లేదు.

'వుంటేవుండి ఏంబస్తోనమ్మ, తల వాచిపోతోంది. కాసేపు తెరిపిగా కూర్చోటానికి వీల్లేకుండా ఒకటే బస్సు బస్సుమని మోతలు. బస్తీలో వాళ్లకి పనేమి వుండదేమిటి వూరికే తిరుగుతూ వుంటారు.' అన్నది వర్ధనమ్మ.

ఒక్కమనిషే యిన్ని సార్లు తిరుగుతున్నాడనుకున్నావా......' వసంత నవ్వింది.

'అవున్లే, ఎట్లాగవులేనే బస్తీలోకి వచ్చిపడ్డావు మరి...మావూళ్లో నేతిబంగ పెరిగిపోతూవుంటే, యిక్కడ పెరగటానికి యేం. అబ్బ, కొట్టాం పొగేనా. ముక్కులు దిబ్బవేసిపోతున్నాయి. మనవూళ్లోను వకటె పెట్టారు గాని యింత వుప్పులాయిలేదు...'వర్ధనమ్మ ముక్కు మూసుకుంది.

'ఈ వూళ్లో యెన్ని ఫ్యాక్టరీలు వున్నాయన్నావు'.

'అబ్బబ్బ వాటిమాటెత్తక. హాయిగా పైరుగాలి పీలుస్తూ పల్లెపట్టున అంటిపెట్టుకువుంటే ఎంతబాగుంటుంది ఏం బావుకుందామని వచ్చినట్లు యీడు నువ్విట్లా అయ్యావో బల్లిలాగ...' వర్ధనమ్మ ఆశ్చర్యంగా ముక్కున వేలు వేసుకుంది.

'అబ్బ వూరుకోవే...' వసంత విసుక్కుంది.

'అమ్మా, అమ్మమ్మకుకూడా కాఫీ యివ్వవే...' చందు పక్కననవ్వాడు.

'అరిపిడుగా అవ్వనుపట్టుకుని వసంతం ఆడినట్లు నాతో యెగతాళా...'

'అమ్మమ్మ నువ్వుకూడా కాస్త...'

'ఏడిశావు విధవపూరుకో...'అవుతే అమ్మాయి బుడ్డ వెధవకికూడా కాఫీ అలవాటు చేశావేమిటి...'

'నేను చేసేదేముంది అమ్మ. నాన్నగారితోపాటు వాడు త్రాగుతూ వుంటాడు.'

'అవున్లెద్దు సంపదుళ్లో వుంటుంది ఏదైనా ప్రొద్దున్నే యింత అన్నం వండి పెడితేయేమి. పసి విధవకదా, యీ వయస్సునుంచీ రెండుపూట్ల అలవాటుచేస్తే యేమన్నా మనిషి యిదవుతాడా...'

'వూరుకోవే వాడు వస్తున్నాడు.'

'అయినా నాకెందుకు నాలుగు రోజులు వుండిపోయేదానికి. నామాట వింటారా పెడతారా. ఎల్లకాలంమీతో పాటు నేను కూర్చోవచ్చానా...'

'కూర్చోండికూర్చోండి మీరు వేస్తారెందుకు. మీరింకా పాతకాలపు పురాణంలోనే వున్నారన్న మాట బస్తీ వాళ్ళకు పిల్లనిచ్చినా...'శేఖర్ సావిట్లోకి వస్తూనే అన్నాడు.

'అవుతే పిల్లలతోపాటు తల్లులు కూడా మారిపోతారా నాయనా...'

'బలే చమత్కారంగా అన్నారే... చిన్న బావమరిదిఅవుతే ఎప్పుడైనా వుత్తరాలు వ్రాస్తూనే వుంటాడు. అక్కయ్య, బావల క్షేమం వ్రాయమని, పెద్దబావగారు బొత్తిగా మమ్మల్ని మరిచేపోయారనుకుంటూ...' శేఖర్ అనేశాడు.

వర్ధనమ్మ మనస్సు నొచ్చుకుంది.

'అదేమిటి నాయనా అట్లా అంటావు. వాడేమో స్వంత వ్యవసాయం పెట్టాడు. సతమతమయి పోతున్నాడు, అంతేకంటె యేంలేదు, వర్ధనమ్మ సమాధానం తనకే తృప్తిని కలిగించలేక పోయింది.

'అవుతే స్వంత వ్యవసాయం చేస్తూ డబ్బుబాగా కూడ పెడుతున్నాడన్న మాట...శేఖర్ చటుక్కున అనేశాడు.

'స్వంత వ్యవసాయం అంటె అది వరకు మాదిరి కాదండి. ఈ రోజుల్లో పల్లెలు మునుపటి పల్లెలులాగ వున్నాయనుకున్నారేమిటి. వక్కడు పలుకుతాడు. పైగా సమయానికి వర్షాలు రాకపోవటం వకటి. పోసిన నారు యెండిపోతుంది. వరుణదేవుని కరుణ రావాలి మరి...' వర్ధనమ్మ తన ధోరణిలోకి పూర్తిగా వెళ్ళిపోయింది.

'వరుణదేవున్ని నమ్ముకునే రోజులు పోయినాయండోయి ఇంకా మనకు కావలసినప్పుడు వర్షాలు కురిపించుకోవటమే...' శేఖర్ క్రొత్త విషయాన్ని వర్ధనమ్మకు చెపుదామనుకున్నాడు.

'బలే చోద్యంగా మాట్లాడుతావే..' వర్ధనమ్మ తేలికగా నవ్వేసింది.

'నిజం అమ్మ, వూరికే అనటంలేదు. కృత్రిమంగా వర్షాలు కురిపిస్తారుట...' వసంత భర్త మాటల్ని నమ్మించటానికి ప్రయత్నం చేసింది.

'పిచ్చి తల్లి. ఏది చెపితే అది నమ్ముతుంది' వర్ధనమ్మ, వసంత జుట్టు నిమిరింది.

'బలే బాగావుంది మీ వరస. నిజం చెప్పినా నమ్మకుండే' శేఖర్ ఆశ్చర్యపోయాడు.

వర్ధనమ్మ పకపక నవ్వేసింది. శేఖర్ కూడా నవ్వాపుకోలేక నవ్వేశాడు. వసంత యిద్దర్ని చూస్తూ, నవ్వుకుంది.

'అవును కానీండి, ఒకసారి మిమ్మల్ని అందర్ని పంపగలుతీసుకు వెళదామని వుంది. ఈసారి ఇక్కడికి రావటానికి కారణం ముఖ్యంగా అదే...' వర్ధనమ్మచెప్పుకుపోతూనే వుంది, పావకోసంగా కూర్చుని.

'ఏది మీ వూరుకా...బలే బాగా చెప్పారు. అక్కడికి వచ్చి బావుకోనేదేమిటండి...' శేఖర్ గభాలున అనేశాడు.

అది కాదు నాయనా పుట్టింటి ఆశ ఆడపడుచుకు వుంటుంది కదా నాలుగు రోజులపాటు నాదగ్గరవుంచుకుని పంపుదామని...' వర్ధనమ్మ తక్కువ స్వరంలో అన్నది.

'మీరు యిక్కడ వుంటే వకటి, మేము అక్కడికి వస్తే వకటీనా, ఎట్లాగవుతే....' శేఖర్ వర్ధనమ్మ వైపుకు తిరిగాడు.

మీరు అట్లా అంటే నేను చెప్పేదేముంది. అయినా మీయిష్టం...' వర్ధనమ్మ అదోవిధంగా అన్నది.

'నేనేదో అభ్యంతరము పెడుతున్నానని అనుకోకండి. మీ అమ్మాయికి యిష్టమవుతే తీసుకు వెళ్ళండి. నాకు వేరేపనివుంది నేను వెళుతున్నాను' అంటూ శేఖర్ వాకిట్లోకి వెళ్ళిపోయాడు.

'ఏమిటే మీఆయన అట్లా మాట్లాడతాడు. అవుతే నాకు తెలియక అడుగుతాను. నేను మీయింట్లో వున్నది నువ్వు వచ్చి నట్టింట వున్నదీ వకటేనా...'

'నీకు యిక్కడ యేం లోటుంది...'

"నువ్వూ అట్లాగే అంటున్నావు... నీ అమ్మ కడుపు కాల, మీదకొచ్చి పడుతోందనుకున్నా, అవతలికన్నా లాగవే. ఎద్దులాగవుంది. దీనిదుంపతెగ, దాని నాలిక చూడు యెంత పొడుగో ప్రాణం తీసేస్తుంది. ఏమేవ్ నిన్నే అట్లా చూస్తూ కూర్చుంటావే' వర్ధనమ్మ గజగజ వణికిపోతోంది.

'ఎందుకే అంత భయపడతావు. అదేమి నిన్నేమి చెయ్యదు. వూరికే అట్లాగే తిరుగుతూ వుంటుంది.'

'ఇంత పెద్దకుక్కను నేను ఎక్కడా చూడలేదే అమ్మాయి.'

'నువ్వొకటె చూశావేమిటి బస్తీలో'

'అంతేలే నిజమే నాకు వకటి తెలుసును కనక. అవతలకు తియ్యవే. ముట్టుకు వస్తుందేమో కూడ' వర్ధనమ్మ తప్పుకు పోతోంది.

వసంత గొలుసు పట్టుకుని లాక్కువెళ్ళి దూరంగా కట్టేసింది. వర్ధనమ్మ గుండె బెదురు కొంచెంగా తగ్గింది.

ఇప్పుడు నేను రవి వకటేఅయ్యాంట. రాజు మామీద కారాలు మిరియాలు నూరుతున్నాడు. తల్లి అని లేదు. చెల్లెలనిలేదు. ఏమిటో అట్లా అయిపోతున్నాడు. ఇంటాక అల్లుడు వుత్తరాలు వ్రాయటం లేదనేటప్పటికి చెడ్డ సిగ్గేసింది చెప్పద్దూ. ఇంతకీ తల్లిఘటం వుందికాబట్టి యెప్పుడైనా కనిపిస్తూ వుంటా' వర్ధనమ్మ కంట తడిపెట్టింది.

'అన్నయ్య యింత మారిపోతాడని అనుకోలేదే నిజంగాను. చిన్నప్పుడు నేనంటే యెంతో యిదిగా వుండేవాడు. ఇప్పుడు నా మాటె లేదేమంట...' వసంత ఆశ్చర్యపోయింది.

'నీసే పనికిరాకటంలా వాడికి. ఇంకా నీ మాటేమిటి. వాడి పద్ధతే మారిపోయింది...' వర్ధనమ్మ సన్నటి ధ్వనిలో అన్నది.

'అమ్మ మనవూరునుంచి కోటయ్య వచ్చాడే...రా కోటయ్య' వసంత గుమ్మంలోకివెళ్లింది, మర్నాడు మధ్యాహ్నము.

'ఏంకోటయ్య యెప్పుడు రావటం. అంతా క్షేమమేనా...వర్ధనమ్మ కుశల ప్రశ్నలువేస్తోంది.

'గాయమ్మగారింట్లో ఆవు యీనింది కోడెదూడ పుట్టిందమ్మ...' కోటయ్య మంచినీళ్ళ గ్లాసు క్రింద పెట్టేశాడు.

'సుభవార్త తెచ్చావు కోటయ్యా. తాయారమ్మ ఇంట్లో పెయ్యదూడ యెట్లావుంది.'

'జబ్బంతా పోయిందండి, ఇప్పుడు బాగావుంది...'

'ఏమిటి అట్లావున్నావు కోటయ్య మావాడు సరిగ్గావుంటున్నాడా...' వర్ధనమ్మ కోటయ్య సమాధానంకోసం ఆదుర్దాగా చూస్తోంది.

'అబ్బాయిగారి కేమిటి బాగానే వుంటున్నారు. ఆ మధుగారు యేవాడు తలపెట్టాడోకాని పార్టీ అంటూ, అనాటినుండీ తగాదాలే నండి ఇప్పుడు మన పల్లె పల్లెగా లేదండి అగ్ని పర్వతం లాగవుంది...' కోటయ్య నిట్టూర్పు విడిచాడు.

'ఇప్పుడు యేమొచ్చిందని...'వర్ధనమ్మ మళ్ళీ అడిగింది.

'పున్నిగాడు బాబుగార్ని కొట్టేశే వాడేనండి, సమయానికి వకమధు అడ్డంరాకపోతే...'

'ఆ...అంతవరకు వచ్చిందా...'

'కిష్టయ్యకూతుర్ని పున్నయ్య తీసుకువెళ్లి యింట్లో పెట్టుకున్నాడండి. దానిమీద మాట మాటా వచ్చేటప్పటికి, పెద్ద తగాదా అయిందండి...'

'ఆ విషయంలో మా వాడు జోక్యం కలుగచేసుకోవటం యెందుకంట...'

'మీకు తెలీదండి చాలా గొడవగా వుంది వనకాల. బాలను పెళ్ళిచేసుకోవాలని మధుగారి ప్రయత్నంటండి. అది అయ్యగారు తెలుసుకుని నలుగురికీ చెప్పేటప్పటికి...'కోటయ్య వాక్యం పూర్తిచెయ్యనే లేదు. 'అయ్యో అయ్యో'! ఛీ! పాడుకాలం ఇదెక్కడైనా నమ్మేకేవా. మేనమామ కూతురు యింట్లోనేవుంది. వాళ్ళిద్దరికి యెప్పుడో నిశ్చయం అయింది. ఏదో ముహూర్తాన పెళ్ళి కూడా అయిపోతుంది. కట్టుకథలు కట్టటంలో కూడా నేర్పుండాలి. మావాడు చెప్పటమూను, మీరు నమ్మటమూను సరిపోయింది...' వర్ధనమ్మ విశదీకరించేసింది.

'అదికాదండి అమ్మగారు. అయ్యగారు యిమామస్య నేమో పట్నంపోయారండి. ఆ యేకనుంచి బాలకూడా వూళ్లో కనిపించటం లేదండి. నలుగురు నాలుగు మాటలు అనుకుంటున్నారు. పున్నయ్య వుతే మాత్రం బాలచదువుకోటానికి పోయిందని బింకంగా చెప్పేస్తున్నాడు. ఏదని నమ్మేటట్లు. ఏదో గూఢార్థం వుంటుందని నా నమ్మకం ....' కోటయ్య విషయాన్ని చెప్పేశాడు.

'బాల బస్తీకి చదువుకు పోయిందా చిత్రంగా వుందే' వర్ధనమ్మ కూడా ఆలోచించటం మొదలుపెట్టింది.

వసంతకు అంతా అయోమయంగా వున్నట్లుంది. అన్నీ చెవులు అప్పగించి వింటూ కూర్చుంది.

'మధుగారింట్లో కూడా సరిగ్గా లేదండి. ఏవేవో చిన్న చిన్న పోట్లాటలు వస్తూనే వున్నాయి. ఎప్పటికప్పుడు ఎవరోకరువస్తూ నేవుంటారు. ఏదో ఆలోచిస్తూ నేవుంటాడు. అవుతే మనబ్బాయి గారుమాత్రం వకకంట కనిపెడుతూనే వున్నాడండి...' కోటయ్య తృప్తిగా అనేశాడు.

వర్ధనమ్మకు యేమీ తోచటం లేదు. వసంతకు పూర్తిగా అర్థం కావటంలేదు.

'ఇంతకీ మావాడు యేమంటాడు...' చివరకుగా అడిగేసింది వర్ధనమ్మ.

'మధు వాళ్లపార్టీ బలమయిపోతే గంగయ్యపార్టీకి దెబ్బ తగులుతుందని...' కోటయ్య, వర్ధనమ్మవంక అదోవిధంగా చూశాడు.

'అమ్మగారు వకసారి మీరువస్తే బాగుంటుందండి...' మళ్లీ కోటయ్య అన్నాడు.

"నేను వచ్చి యేం చేస్తాను కనక. నామాట నా కొడుకే వినకపోతే ఇంకొకరు యేమొహం పెట్టుకుని చెపుతాను కనుక..." వర్ధనమ్మ నిస్పృహగా మాట్లాడింది.

కోటయ్య తెల్లమొహం వేసుకుని కూర్చున్నాడు.

వర్ధనమ్మను ఆ వూరికి తీసుకు వెళదామని యెంత ప్రయత్నించినా కోటయ్య సఫలీకృతుడు కాలేకపోయాడు. ఒకవిధమయిన నిరాశాభావంతో మరునాడు రెండు గంటల బండికి తనవూరికి బయలుదేరాడు కోటయ్య.

* * *

రాజారావుకు, మధుకు ప్రతి చిన్న విషయంలోను హోరాహోరీ పోట్లాట జరుగుతూనే ఉంది. అందులో వూరి బయటజాబిత్వ విషయంలో పెద్దరభస అయింది. రాజారావుకు అక్కడి బావి వుండటంవలన, వచ్చే పడుపాయాలు తెలిసి కూడా మధు ఆ పని మొదలు పెట్టాడు. కాబట్టి దాన్ని తప్పనిసరిగా ప్రతిఘటించాలిసి వచ్చింది. తగిన కారణాలు చూపలేకపోవటంవలన, రాజారావుకు ఆత్మీయులు అనుకున్న వాళ్ళే రాజారావును చూసి అసహ్యించుకోవటం మొదలు పెట్టారు. కాని రాజారావుయొక్క క్రౌర్యాన్ని చూసి భయపడి యెవరూ కూడా ఆయన మొహం యెదుట చెప్పటానికి సాహసించలేక పోతున్నారు. మధు యీ సందర్భంలో రెండుమూడు మీటింగులు పెట్టి ప్రజల్ని వప్పించాడు. అది యింకా గుర్రుగావుంది రాజారావుకు. ఇక తాను మధు పలుకుబడిని తగ్గించటానికి యేమీ చెయ్యలేనేమో అని భయపడిపోతున్నాడు. అప్పటినుంచి అతని మనస్సు ఇంకోవిధంగా పనిచెయ్యటం మొదలు పెడుతోంది. దానికి మద్దతుగా కోటయ్య, సూరయ్య నిలబడివున్నారు. రాజారావు చెప్పిందల్లా వప్పుకోనటంలో వీళ్ళిద్దరికి వచ్చిన ప్రత్యేక ఘనత యేమీ లేదు. కాని రాజారావును ప్రతి విషయంలోను బల పరచాలనే వక అభిప్రాయం మాత్రం వీళ్ళిద్దరిలోనూ నాటుకుపోయింది. ఆ మైకంలో, తమకువచ్చే నష్టంగాని, ప్రమాదంగాని వాళ్లు కనుక్కోలేక పోయారు.

'అవునుదొర...ఇది చాలాబాగుంది. దాంతో మధుకూడా సమాప్తి. ఇక అయ్యగారిదే రాజ్యం...' కోటయ్య జబ్బలుకొడుతూ కులికాడు.

'...ఏమో ప్లానవుతే బాగుందికాని తీరా యెవరైనా పసికడితే యేమవుతుందో అని భయంగా వుంది....' అన్నాడు సూరయ్య కొంచెం జంకా ముందు ఆలోచిస్తూ.

'నీకేమిటిభయం. మేమంతావుండగా ...'కోటయ్య ధైర్యం చెప్పాడు.

కీచురాళ్లు కుంయ్ మంటూ ధ్వని చేస్తున్నాయి. చిట్ట చీకటి గడ్డివాముల చాటున నలుగురు కాచుకుకూర్చున్నారు. గొడ్లపాకడి మలుపున ఓ వ్యక్తి ఆదరాబాదరాగా వస్తున్నాడు. ఇంతలో యీల వినిపించింది. గభాలున నలుగురు నాలుగువైపులనుంచివచ్చేసి ఆవ్యక్తిని గబగబ బాదేశారు అయ్యో అంటూ కూలబడ్డాడు. పాలికేరలోంచియింకా అయిదారుగురు యీ కేకలు విని పరుగెత్తుకుంటూ వచ్చారు. అందరూ కలిసి దెబ్బలు తిన్న వ్యక్తిని ఆసుపత్రికి తీసుకుపోయారు. మూర్ఛ నుదయం అవగానే, రాజారావును రాత్రిపూట వంటరిగా చూసి నలుగురు చావమోదారని వార్త పాక్కిపోయింది.

దెబ్బలు కొట్టిన నలుగురూ కూడా గాభరాపడిపోయి రెండోకంటివానికి తెలీకుండా వూరు వదిలిపెట్టి పారిపోయారు. రాజారావు, పార్టీ వారు కొందరు ఈ పని మధే చేయించివుంటాడని రిపోర్టుచేశారు. రాజారావు స్నేహితుడొకడు అక్కడకు ఇన్స్పెక్టరుగా రావటంవలన, వెంటనే మధును అరెస్టు చేశాడు. సుజాత, కాంతమ్మలు హాహాకారాలతో ఏడవటం మొదలుపెట్టారు.

'ఎందుకు యేడుస్తారు. అనవసరం మీద అరెస్టుచేస్తారు. భయపడాలిసిందేమీలేదు. నేనవుతే ఆపని చేయించలేదని మీకు కటిగా తెలుసుకదా మళ్లీ రెండు మూడు రోజులలో తిరిగివచ్చేస్తాను. నేను వచ్చేలోగా మీరు జాగ్రత్తగా మెలగుతూ వుండాలి. ఇదుగో పున్నయ్య మనయింటిదగ్గరే వుంటాడు. మీకేం భయంలేదు...'అని ధైర్యం చెప్పేసి మధు ఇన్స్పెక్టరుతో కూడా స్టేషనుకు వెళ్ళాడు.

'నరసిగాడు, వాంచారయ్య కనిపించటంలేదుట. నీకేమన్నా తెలుసా...'

'రత్తియ్య, బొజ్జగాడు కూడా కనిపించటంలేదుట. ఎక్కడకు పోయారో...'

వూళ్లో వాళ్లందరినోట యీమాటలే.

కోటయ్య సూరయ్యలకు కాళ్ళు చేతులు ఆడటంలేదు. వాళ్లు నలుగుర్లో కలిసి తిరగటంలేదు. ఎవరైనా వాళ్లింటికివచ్చి యేమాట అడిగినా అపనమ్మకంతోను, భయంతోను చూస్తున్నారు వాళ్లివంక. ఈ విషయం పున్నయ్య దాక ప్రాకింది. పున్నయ్య మనస్సు పనిచెయ్యటం మొదలు పెట్టింది. వెంటనే రిపోర్టు చేశాడు సబ్ఇన్స్పెక్టరుకు. ఇన్స్పెక్టరు నవ్వి, మీ పార్టీల గొడవలతో నాకేమి సంబంధంలేదు. నా విధి నేను నిర్వర్తించుకుంటాను. ఇందులో మీ సహాయం కావాలని నేను కోరితే మీరు చెప్పండి, లేకపోతే మీరు నా దగ్గరకు రావటం అనవసరం అన్నాడు.

పున్నయ్యకు కొడ్డకోపం(?) వచ్చింది. మధును చూసి కొంచెం వెనక్కు తగ్గాడు. వెంటనే పెద్ద ఆఫీసర్లకు, ఇక్కడ విశేషాలన్నింటిని పూస గ్రుచ్చినట్లు వ్రాసి, అర్జీపెట్టాడు పున్నయ్య. ఆసుపత్రిలో ఓమూల రాజారావు ప్రమాద స్థితిలో వున్నాడు.

నరసిగాడు, బుల్లిగాడు, రత్తియ్య, వాంచారయ్యలమీద ఆరెస్టు వారెంట్లు జారీ అయినాయి. వాళ్లకోసం పోలీసులు గాలిస్తున్నారు. కోటయ్య, సూరయ్య ప్రాణాలు తహతహలాడుతున్నాయి. ఆసుపత్రికి వెళ్లి, రాజారావును చూసేటప్పటికి తెల్లబోయారు. రవికొరకొర చూపు చూస్తూ కసురుకున్నాడు.

మధుబోన్లో నుంచున్నాడు, ప్లీడర్లు ప్రశ్నలు వేస్తున్నారు.

'...ఆరాత్రి షుమారు ఎనిమిది గంటలకు రాజారావు నా యింటికివచ్చి, వూరుబైట పసువుల సావిడి దగ్గరకు రమ్మనమని, పున్నయ్య, సూరయ్యలు కూడా అక్కడ వున్నారని, మనం కొన్ని విషయాలు ముఖ్యంగా మాట్లాడాలని చెప్పాడు. నేను అట్లాగేవస్తానని చెప్పి బయలుదేరబోతుండగా, 'అమ్మో తేలు కుట్టింది...' అన్నమా అమ్మ పెద్ద పెట్టున అరిచింది. వెంటనే వెళ్ళి, మాఅమ్మకాలికి కట్టుకట్టి, మందుకోసం తిత్తరగా వాకిట్లోకి వెళ్లాను. అప్పటివరకు రాజారావు వాకిట్లోనే నుంచున్నాడు. నేను వీధిలోకి వెళ్ళి కేకపెట్టాను. ఇంతలో ప్రక్కయింటి వాళ్లు యిద్దరొచ్చారు. నేను వాళ్ళతో గుమ్మంలో అడుగు పెట్టేటప్పటికి రాజారావు కనిపించలేదు...తర్వాత నాకు మర్నాడు ఉదయం, రాజారావును యెవరో కొట్టారని చెప్పేటంతవరకు నాకు యే సంగతీ తెలీదు...' మధు నిశ్చలంగా, జడ్జివైపుకు చూస్తూ చెప్పాడు.

ఇంతలో ఆ నలుగుర్ని పోలీసులు అరెస్టుచేసి తీసుకువచ్చారు. అందులో బుల్లిగాడు పెద్ద పెట్టున ఏడుస్తూ వస్తున్నాడు.

'నాకేం తెలీదండీ......ఇదంతా సూరయ్యచేసిన పని, మధును చంపమని మానలుగుర్ని రాత్రికాడ గడ్డివాముల దగ్గరకు పంపించాడు. రాజారావుగారు అనుకోలేదండీ...నరసిగాడు యీలవెయ్యంగానే కొట్టేశామండి... క్షమించండి...!' బుల్లిగాడు జరిగిందంతా చెప్పేశాడు.

వెంటనే వీళ్ళ నలుగుర్ని జైలుకు పంపించేశారు. కోటయ్య, సూరయ్య చేతులకు బేడీలు వేసి, లాకప్లో వుంచారు. వూరంతా రాజారావన్నా, ఆ పార్టీ అన్నా వుద్రిక్తులై పోతున్నారు.

దీపావళి కలవలకు, బాల యింటికి వచ్చేసింది. కాంతమ్మ దగ్గరకువెళ్లి, వర్ధనమ్మ ప్రాధేయపడింది, తన కొడుకు తప్పు క్షమించమని.

ఊరంతా దీపాలు వెలిగించారు. కళకళలాడిపోతోంది. దీపాల కళకళలకంటె ప్రజల మొహాలు కళకళలాడిపోతున్నాయి.

ఓ ప్రమిద వెలిగించి, సుజాత చేతికి యిచ్చాడు, గుమ్మటంలో పెట్టమని బాల యింకో ప్రమిద వెలిగించి అరుగుటంలోనే పెట్టేసింది. మధు దీపాన్ని చేతులోపట్టుకొని, ఎత్తుగావున్న గోడమీద అందరికీ కనపడేటట్లు పెట్టాడు.

ఆదివ్య జ్యోతుల్లో సుజాత ముసిముసి నవ్వులు, బాల పకపకలు, మధు చిరునవ్వులు, అందరికీ చూడ ముచ్చటేసినాయి.

'అమ్మా,' అన్నట్లు, నా పెళ్ళికి లగ్నం పెట్టించావా' మధు సుజాతను చూసి నవ్వాడు.

'ఇంతసేపు వుత్తి నాయనా...ఎప్పుడో పెట్టించాను దశమి సోమవారం...' కాంతమ్మ సంతోషాన్ని ఆపుకోలేకపోయింది.

సుజాత సిగ్గు బరువుతో తలవంచుకుని చిన్ను బుడ్డిని చూస్తోంది.

# వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

## యుద్ధకాండ రెండవ భాగము

### ౬౩

రావణాసురుడు దిగులుపడిపోయి చెప్పిందంతా కుంభకర్ణుడు విన్నాడు. నవ్వుతూ "అన్నా, ఇదివరకు ఈ విషయము మనము ఆలోచించినాము. ఈ ఆపద వస్తుంది అనే అనుకొన్నాము. సీతను ఇచ్చి వేయమని నీ మేలుకోరి చెప్పిన మాట నీవు వినలేదు. అందువల్ల ఇప్పుడు నీకు ఆపద వచ్చింది. దుష్కృత్యాలు చేసిన వారు దేహము చాలించిన తరువాత నరకములో పడిపోతారు, అని అంటారు. సీతను అపహరించుకొని వచ్చిన పాపకృత్యానికి నీవు వెంటనే ప్రతిఫలము అనుభవించవలసి వచ్చింది.

"రాజా, నీవు కేవలము పరాక్రమమువల్లనూ దర్పమువల్లనూ సీతను ఎత్తుకొని వచ్చినావు. కాని ఏటువంటి ఆపదలు వచ్చేదిన్నీ ముందుగా నీవు ఆలోచించలేదు. నీతిజ్ఞుడు అయిన ప్రభువు ఎవడూ ముందు చేయవలసిన పనులు వెనకనూ వెనక చేయవలసిన పనులను ముందూ చేయడు. నియమపూర్వకముగా వేదాధ్యయనము చేయనివారు యజ్ఞాదులలో వేల్చిన ఆజ్యాది హోమద్రవ్యాలవలె దేశకాలవిరుద్ధముగా చేసిన పనులు ప్రతికూలము అయిపోవడమే కాకుండా దోషఫలాన్ని కూడా ఇస్తవి.

"రాజా, తాను బలవంతుడు అయి శత్రువు బలహీనుడుగా ఉంటే శత్రువుతో యుద్ధము చేయవలెను. తానూ తన శత్రువూ తుల్యబలవంతులుగా ఉంటే సంధి చేసుకోవలెను. తాను బలహీనుడుగానూ శత్రువు బలవంతుడుగానూ ఉన్నప్పుడు తాను లొంగిపోయి శత్రువుకు కప్పము కట్టవలెను. మంత్రులతో చక్కగా ఆలోచించి ఈ ఉక్తిని ముఖ్యసాధన మార్గాలలో దేనినో ఒకదాన్ని నిర్ణయించి పనిచేయవలెను. అంతేకాదు. ఆ చేయ నిశ్చయించుకొన్న పనిని ఆరంభించే ఉపాయమూ అందుకు అవసరములయిన ద్రవ్యసాధనసంపత్తి అందుకు అనుగుణములయిన దేశమూ కాలమూ అందుకు వచ్చే విఘ్నాలూ ఆ విఘ్నాలకు ప్రతీకారము ముందుగా ఆలోచించుకోవలెను. ఇట్లా ఈ అయిదింటిని ఆలోచించి పనులు చేసే వాడే నీతిజ్ఞుడు.

ఏ పని చేయడానికి అయినా మంత్రుల అభిప్రాయము ముందుగా తెలుసుకోవలెను. ఆ తెలుసుకొన్న అభిప్రాయాన్ని ఆప్తమిత్రులతో ఆలోచించవలెను. ఆ తరువాత నీతిశాస్త్ర విరుద్ధముగా కాకుండా పనిచేయవలెను. అట్లా చేసే రాజు ఎప్పుడూ జయిస్తాడు.

"ఓ రాజా, ప్రాతఃకాలాన ధర్మాన్నీ మధ్యాహ్నకాలాన అర్థాన్నీ సాయంకాలాన కామాన్నీ సేవించవలెను. అట్లా కాకపోయినట్లయితే జంటలు జంటలుగా అంటే ప్రాతఃకాలాన ధర్మార్థాలనూ మధ్యాహ్నకాలాన అర్థధర్మాలనూ సాయంకాలాల కామార్థాలనూ సేవించవలెను. లేదా ధర్మార్థకామాలను మూడింటినీ సాయంకాల మప్పుడు అయినా సేవించవలెను. సర్వకాలాలలోనూ కామాన్ని మాత్రము సేవించకూడదు. ధర్మార్థకామాలు మూడింటిలో శ్రేష్ఠము అయింది ధర్మము. అది అట్లాగు అని తెలిసీ కూడా దానిని ఆదరణలో పెట్టని రాజు కాని రాజు అంటిటే వాడు కాని సంపాదించిన శాస్త్రజ్ఞానము అంతా వ్యర్థము. ధర్మార్థకామాలను అనుష్ఠింపా అవసరము అయినప్పుడు మంత్రులతో కూడా ఆలోచించి సామదానభేదదండాలు అనే నాలుగు ఉపాయాలలో ఏ ఒక్క ఉపాయాన్నో రెంటినో కాక నాల్గింటినో ఆదరించవలెను. అట్లా చేయని రాజు ఈ లోకములో దుఃఖాలపాలు అయిపోతాడు. తనకు యేది మేలో యేది కీడో తాను యే పని చేయవలెనో యే పని చేయకూడదో కార్యతత్త్వజ్ఞులు అయిన మంత్రులను ముందుగా ఆలోచించి పనులు చేసే రాజు ఎప్పుడూ సుఖపడుతాడు.

నీతి శాస్త్రార్థము ఏ కొంచెమూ తెలియని మంత్రులూ తమ ప్రాగల్భ్యము చూపించడానికి ఆలోచనాసభలలో పశుబుద్ధితో ఏమేమో పలుకుతారు. నీతిశాస్త్రాన్ని కానీ ఇతరశాస్త్రాలను కానీ తెలుసుకోకుండా చెప్పే వారి వల్ల కీడు వాటిల్లుతుంది. కనుక మహా ఐశ్వర్యము కాంక్షించే రాజు అటువంటి అజ్ఞులు చెప్పే ఏ పని చేయకూడదు. వారు తమ ప్రాగల్భ్యముతో కీడును మేలుగా చేసి చెప్పుతారు. అటువంటి వారి మాటల వల్ల పనులు పాడు అయిపోతవి. కాబట్టి అది తెలుసుకొని అటువంటి వాండ్లను మంత్రసభకు రానీయకుండా బయటనే ఉంచవలెను.

మంత్రులు శత్రువులతో చేరి తమ రాజును నాశనము చేయడానికి తమ రాజు చేతనే విపరీతపు పనులు చేయిస్తూ ఉంటారు. పయికి మిత్రులవలె నటిస్తూ శత్రువుల సొమ్ము తిని అమిత్రులు అవుతారు. అటువంటివారిని వారి మంత్రనిర్ణయాలను పట్టే తెలుసుకోవచ్చును. అందువల్ల శత్రువుల సొమ్ము తిన్న మంత్రులు చెప్పినట్టు ఆ యా పనులు అవివేకముతో చేసే చపలచిత్తులు రాజుల లోపాలను శత్రువులు ఇట్టే కనుక్కొంటారు. వారి కనపడని పక్షులు క్రౌంచపర్వతరంధ్రములో నుంచి దూరి అవతలకు పోలేనట్టు శత్రువులు తమ పనులను ఎదటి వారి దుర్మంత్రుల మూలకముగా సాధించుకొంటారు. శత్రువులను తెలుసుకొని తనను కాపాడుకోని రాజు ఆపదల పాలు కావడమే కాకుండా రాజ్యాన్ని కూడా పోగొట్టుకొంటాడు.

"అన్నా, నీవు ఈ విషయములో ఇదివరకు విభీషణుడు చెప్పినట్టు చేసి ఉండవలసింది. ఇప్పుడున్నూ అది మంచిపని అని నాకు అనిపిస్తూ ఉంది. అట్లా కాదు అనేటట్లయితే నీ ఇష్టము వచ్చినట్టు చేయవలసింది" అని కుంభకర్ణుడు చెప్పినాడు.

ఇట్లా కుంభకర్ణుడు చెప్పింది అంతా రావణాసురుడు విన్నాడు. అతనికి కోపము వచ్చింది. కోపముతో కనుబొమలు ముడివేసి కుంభకర్ణుణ్ణి చూచి "తమ్ముడా, నీవు ఏదో పరమపూజ్యుడవలెనూ ఆచార్యుడివలెనూ గురువువలెనూ నన్ను శాసిస్తూ ఉన్నావు. ఇట్లా చెప్పడము వృథా ప్రయాస. ఈ మాటలవల్ల ప్రయోజనము ఏమీ లేదు. ఇది నీతివిచారానికి సమయము కాదు. ఈ సమయానికి ఉచితము అయిన పనిని ఇప్పుడు చేయవలెను. భ్రాంతివల్లనో తెలివితక్కువ వల్లనో నేను ఏదో చేసినాను. ఆ చేసినదాని గురించి ఆలోచించడానికి కాని దానిని తిరగతోడడానికి కానీ వీలు లేదు. దానిని గురించి ఇప్పుడు ఏమి అనుకొన్నా ఏమీ ప్రయోజనము లేదు. బుద్ధిమంతులు అయిపోయిన దానికోసము దుఃఖపడరు. అయిపోయింది ఎట్లాగూ అయిపోయింది. అది తిరిగి రాదు. తమ్ముడా, నీకు నా మీద స్నేహము ఉన్నట్లయితే నీవు నీ పరాక్రమాన్ని నమ్ముతూ ఉన్నట్లయితే నీవు నాకు సహాయము తప్పకుండా చేయవలెను అనుకొనేటట్లయితే నా దోషాన్ని నీ పరాక్రమముతో సరిచేసి పెట్టు. ఆపదలపాలు అయి దీనదశలో ఉన్న వానికి సహాయము చేసే స్నేహితుడే స్నేహితుడు. నీతితప్పి సహాయము కావలెను అనుకొంటున్న వానికి సహాయపడే బంధువే బంధువు" అని రావణాసురుడు అన్నాడు.

ఇట్లా తెగతెంపులుగా చెప్పినందువల్ల రావణాసురుడికి కోపము వచ్చింది అని కుంభకర్ణుడు తెలుసుకున్నాడు. అంతట మెల్లగానూ మృదువుగానూ "రాజా, నీవు సంతాపపడవద్దు. కోపము వదిలిపెట్టు. స్వస్థముగా ఉండు. నేను జీవించి ఉండగా నీవు దుఃఖపడవలసిన పనిలేదు. నీవు ఎవరికోసము ఇట్లా పరితాప పడుతూ ఉన్నావో వాణ్ణి నేను నాశనము చేసివేస్తాను. బంధుత్వము నుంచి అందులో భ్రాతృగౌరవమునుంచి నేను ఎప్పుడూ నీకు హితము చెప్పవలెను. అది నా విధి. అందువల్ల చెప్పినాను. బంధువు అయినవాడు అందులో స్నేహితుడు అయినవాడు ఈ సమయములో ఏమి చేయడము మంచిదో అది యుద్ధములో చేసి చూపిస్తాను. నేను నీ శత్రువులను అందరినీ సంహారము చేసివేస్తాను.

ఓ మహాబాహూ, నేను ఇప్పుడే రామలక్ష్మణులను చంపివేస్తాను. వానరసైన్యాన్ని పరుగెత్తిస్తాను. యుద్ధభూమిలోనుంచి రాముడి శిరస్సు తీసుకొనివచ్చి నీకు సమర్పిస్తాను. ఆశిరస్సును చూచి సీతాదేవి దుఃఖపడవలెను. నీవు సుఖపడవలెను. బంధువులను కోలుపోయి ఇప్పుడు లంకాపట్టణములో దుఃఖపడుతూ ఉన్న రాక్షసులు అందరూ చూచి సంతోషపడేట్టు రామలక్ష్మణులను సంహారము చేసివేస్తాను. ఓ రాజా, నీ శత్రువులను అందరినీ నాశనము చేసివేయడానికి నేను దేవేంద్రుడితోనయినా యముడితోనయినా పోరాడుతాను. నేను పెంపారవాదము చేస్తే నా తీక్ష్ణదంష్ట్రలనూ నా పర్వతాకారాన్నీ నా చేతిలో ఉండే శూలాన్నీ చూచి దేవేంద్రుడు అయినప్పటికిన్నీ పారిపోతాడు. నాకు శూలముకూడా అవసరములేదు. నేను ఏ ఆయుధమూ లేకుండా నా బాహువులతోనే శత్రువులను చంపివేయగలను. నేను అట్లా నా బాహువులతో శత్రువులను చంపివేయడము మొదలుపెట్టితే బ్రతుకు విలువున్నవాడు ఎవడూ నా ఎదుట నిలవలేడు. నాకు శక్త్యాయుధము అక్కరలేదు. గద అక్కరలేదు. ఖడ్గము అక్కరలేదు. నిశితాస్త్రాలు అంతకన్నా అక్కరలేదు. నేను కోపముతో ఇంద్రుణ్ణి అయినా చంపివేయగలను. శ్రీరాముడు నా పిడికిటిపోటు తాలుకోగలిగినట్లయితే నాకు బాణాలు వదలవలసిన అవసరమే ఉండదు. ఆ తర్వాత వాడు బతికి ఉండడము సంభవిస్తుంది.

"రాజా, నేను జీవించి ఉండగా నీవు దుఃఖపడవలసిన పనేమి. భయపడడము ఎందుకు. నేను నీ శత్రువులను అందరినీ నాశనము చేసి వేయడానికి పోతున్నాను. రాముణ్ణి గురించిన భయము వదిలిపెట్టు. నేను రామలక్ష్మణులనూ సుగ్రీవుణ్ణి చంపివేస్తాను. అంతటితో ఊరుకోను. రాక్షసులను చంపివేసి లంకను దహించివేసిన హనుమంతుణ్ణి మిగతా వానరయోధులనూ రూపు మాపివేస్తాను. నీవు అసాధారణము అయిన మహాయశస్సు సంపాదించి పెట్టుతాను.

"రాజా, నీవు బ్రహ్మదేవుడి వల్లకానీ దేవేంద్రుడి వల్లకానీ భయము లేకుండా చేసివేస్తాను. నాకు కోపము వస్తే దేవతలను అందరినీ నేలమీద పడవేస్తాను. నేను యముణ్ణి అయినా ఎప్పటికీ నిద్రలేవకుండా చేసివేస్తాను. అగ్నిహోత్రుణ్ణి అయినా భక్షించివేస్తాను. నక్షత్రాలతోకూడా సూర్యుణ్ణి నేలమీద పడగొట్టుతాను. సముద్రాన్ని దాహము తీర తాగివేస్తాను. పర్వతాలను నుగ్గునుగ్గుగా చేసివేస్తాను. ఈ భూమిని పెకలించివేస్తాను. నేను ప్రాణికోటిని భక్షిస్తూ ఉండే ఓపాటి కాలము నిద్రపోయిన కుంభకర్ణుడి పరాక్రమము అందరికీ తెలుస్తుంది. ముల్లోకాలూ నా ఆహారానికి చాలవు.

"ఓ అన్నా, నీవు సుఖము అనుభవించవలెను. అందుకోసము ఆ రాముణ్ణి చంపివేయడానికి పోతున్నాను. వాడితోపాటు వాడి తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి చంపివేస్తాను. వానరయోధులను అందరినీ భక్షించివేస్తాను. రాజా, నీ చిత్తము వచ్చినట్టు నీవు ఇక్కడ క్రీడిస్తూ ఉండు. మంచి మద్యము తాగుతూ ఉండు. నీ ఇష్టము వచ్చిన పనులు చేసుకొంటూ ఉండు. దిగులు పడవద్దు. ఇప్పుడే రాముణ్ణి చంపివేస్తాను. సీతాదేవి నీ వశము అవుతుంది. ఆ మీదట బహుకాలము సుఖము అనుభవించు" అని చెప్పినాడు.

### ౬౪

రామ లక్ష్మణులను చంపివేస్తాను అని చెప్పిన ఆ మహాబలవంతుణ్ణి ఆ మహాబాహువును కుంభకర్ణుణ్ణి చూచి మహోదరుడు అనే మంత్రి "ఓ కుంభకర్ణుడా, నీవు ఉత్తమ వంశములో పుట్టినావు. కాని ప్రాకృతుడవు. మోటవానివు. ఏ సమయములో ఏ పని ఎట్లా చేయవలెనో నీకు తెలియదు. రాజకీయ విషయాలు తెలియక పోలేదు. నీవు అజ్ఞానం వల్లనూ మొరటుతనము వల్లనూ అధిక ప్రసంగము చేసినావు. మనరాజు దేశకాల విభాగము బాగా ఎరిగినవాడు. తన స్థానాన్నీ శత్రువుల స్థానాన్నీ తన వృద్ధిక్షయమునూ శత్రువుల వృద్ధిక్షయాలనూ చక్కగా తెలుసుకొన్నవాడు. బలవంతుడు అయినవాడు. అందులో పెద్దలను ఉపాసించనివాడూ బుద్ధిబలము లేనివాడూ చేయరాదు అనుకొనే పనిని సర్వమూ తెలిసిన పండితుడు ఎందుకు చేస్తాడు. మనరాజు ఏదీ తెలియకుండానూ ఆలోచించకుండానూ చేయలేదు.

"ధర్మార్థకామాలు ప్రత్యేకముగా ఫలాన్ని ఇస్తవి అని నీవు చెప్పినావు. వాటి స్వభావము అది అని నీకు ఎట్లా తెలిసింది. అందుకు ప్రమాణము ఏమిటి. రాజు సీతను ఎత్తుకొని రావడము అధర్మమనీ అందువల్ల ఆయనకు ఇప్పుడు ఈ ఆపద వచ్చింది అనీ నీవు చెప్పినావు. మంచిపని చేస్తే మంచిఫలము వస్తుంది అనీ చెడు పని చేస్తే చెడుఫలము వస్తుంది అనీ నీ అభిప్రాయము అయి ఉండవలెను. అయితే ఈ ప్రపంచములో నీవు చెప్పినట్లు జరగడము లేదు. మంచి పనులు చేసినా చెడు ఫలమూ చెడుపనులు చేసినా మంచిఫలమూ అనుభవించడం చూస్తూనే ఉన్నాము. ఫలప్రాప్తి ఆ యా పనులనుబట్టే ఉంటుంది. ధర్మార్థాలను పట్టి సుఖఫలమూ అధర్మానర్థాలను పట్టి దుఃఖఫలము వస్తుంది అనుకోవడము పొరపాటు. ఈ పనికి ఈ ఫలము అనే నియమము ఏమీ లేదు. తాను కష్టపడి సంపాదించిన ధనము సుఖఫలాన్ని ఇతరుల దగ్గర దొంగిలించి తెచ్చిన ధనము దుఃఖఫలాన్ని ఇవ్వదు. అదేవిధముగా తన సొంతభార్యను అనుభవిస్తే సుఖము పరాయివాడి భార్యను అనుభవిస్తే దుఃఖమూ వస్తుందా. అందువల్ల ఏ పనివల్ల సుఖము వస్తుంది అనుకొంటే ఆ పని చేయవలెను. ఇహలోక సౌఖ్యానికీ పరలోక సౌఖ్యానికీ అందరూ ఆయా పనులు చేస్తూవుంటారు. శాస్త్రవిహితము కాని పనులు తమ చిత్తము వచ్చినట్టు చేసినవారున్నూ ఈ లోకములో సుఖము అనుభవిస్తున్నారు. అందువల్ల శాస్త్రవిహితము అయిన పనులే సుఖఫలాన్ని ఇస్తవి అనే నియమమూ శాస్త్రనిషిద్ధము అయిన పనులు దుఃఖఫలాన్ని ఇస్తవి అనే నియమమూ లేదు. ధర్మార్థాలకు వలెనే కామానికి కూడా ఫలనియమము లేదు. ఏ పని చేసినా ఒక సమయములో సుఖమూ మరి ఒక సమయములో దుఃఖమూ రావచ్చును. రాముడు జనస్థానములో చేసిన పనినుంచి మనరాజుకు శత్రువు అయినాడు. శత్రువు విషయములో సాహసము చేస్తే తప్పు ఏమీ లేదు. అందువల్ల మనరాజు సీతను ఎత్తుకొని వచ్చినాడు. అందుకు మేము మంత్రులము సమ్మతించినాము.

"ఓ కుంభకర్ణుడా, నీవు ఒంటరిగాపోయి యుద్ధము చేస్తాను అంటున్నావు. అందుకు నీ పరాక్రమమే కారణము అని చెప్పినావు. నీవు చెప్పిన కారణము యుక్తియుక్తముగా లేదు. ఇదివరకు జనస్థానములో మహాబలవంతులు అయిన రాక్షసులను అనేక వేలమందిని రాముడు ఒక్కడే చంపివేసినాడు. అటువంటి వాడితో నీవు ఒంటరిగా ఎట్లా పోరాడుతావు. ఎట్లా జయిస్తావు. జనస్థానములో అంతమంది రాక్షసులను చంపివేసినందువల్లనే రాముడి పేరు చెప్పితే రాక్షసులు అందరూ భయపడుతూ ఉన్నారు. అది తెలియక రాముడిమీదికి నీవు ఒంటరిగా పోవలెను అనుకొంటున్నావు.

"ఆ రాముడు కుపితసింహమువంటివాడు. నిద్రపోతున్న మహాసర్పము వంటివాడు. ఎప్పుడూ మహాతేజముతో జ్వలించే అగ్నిహోత్రమువంటివాడు. ఎదిరించ వలనుకాని మృత్యువువంటివాడు. అతడికి కోపము వస్తే ఎంతటివాడు అయినా అతనిని నిలువరించడము ఉత్తిది. ఆ రాముడి ఎదుట మన ఈ రాక్షససైన్యము అంతా కూడా నిలవగలదో లేదో సందేహమే. అటువంటివాడిమీదికి ఒంటరిగా పోవడము ఎంతమాత్రమూ పనికిరాదు. మహాబలవంతుడు అయిన శత్రువును అల్పుడు అనుకొని లెక్కచేయకుండా బలహీనుడవుపోయి తన ప్రాణాలు పోగొట్టుకోకూడదు.

"ఓ కుంభకర్ణుడా, నీవు రాక్షసులలో మహాబలవంతుడవు కాదు అని ఎవరూ అనడము లేదు. కాని సమస్త మానవులలో రాముడితో సరిసమానము అయిన బలవంతుడూ పరాక్రమవంతుడు మరి ఒకడు లేడు. ఇది నీవు తెలుసుకో. అతడు దేవేంద్రుడివంటి పరాక్రమవంతుడు. సూర్యుడివంటి తేజోవంతుడు. అతడితో నీవు ఒంటరిగా ఎట్లా పోరాడవలెను అనుకొంటున్నావు" అని అడిగినాడు.

ఈ విధముగా కుంభకర్ణుణ్ణి అడిగి ఆ మహోదరుడు ఆ రాక్షసులు అందరి మధ్యనూ కోపముతో తగిలోకరావణుడు అయిన రావణుణ్ణి చూచి "రాజా, నీవు సీతాదేవిని తెచ్చుకొన్నావు. ఆమె ఇక్కడనే ఉంది. కాని నీవు ఏమేమో మాట్లాడుతావు. నీవు కావలెను అనుకొన్నప్పుడు ఆమె నీవశమూ అవుతుంది. నాకు ఇప్పుడు ఒక ఉపాయము తోచింది. చెప్పుతాను. నీ స్వబుద్ధితో ఆలోచించు.

"నేనూ ఈ కుంభకర్ణుడూ ద్విజిహ్వుడూ సంహ్రాది వితర్దనుడూ రాముణ్ణి సంహారము చేయడానికి పోవలెను అని నీవు చాటించు. అంతట మేము అయిదురముా పోయి పెద్ద ప్రయత్నముతో యుద్ధము చేస్తాము. రాముణ్ణి మేము జయించగలిగితే ఏ ఉపాయమూ అక్కరలేదు; పోరాటములో మేము జయించలేక పోయినట్లయితే నేను ఇప్పుడు చెప్పే ఉపాయము పనిచేస్తుంది.

"మేము మా శరీరాలను బాణాలతో ఛేదించుకొని నెత్తురుతో తడిసి రాముడి పేరు చెక్కిన బాణాలతో ఇక్కడికి వస్తాము. మేము రామలక్ష్మణులను భక్షించివేసినాము అని చెప్పుతూ నీ పాదాలు పట్టుకొని నమస్కారము చేస్తాము. నీవు అప్పుడు మమ్ములను బహూకరించవలెను. అంతట ఒక రాక్షసుణ్ణి ఏనుగు మీదను ఎక్కించి అయిదుగురు రాక్షసులూ రామలక్ష్మణులనూ వానరులను చంపివేసినారు అని లంకాపట్టణము అంతటా చాటించేట్టు చేయవలెను. అప్పుడు నీవు నీ సంతోషము ప్రకటించడానికి నీ పరివారానికీ నీ భృత్యులకూ కోరుకొన్న ధనాన్ని భోగద్రవ్యాలనూ ఇవ్వవలెను. యోధులకు పూలదండలూ వస్త్రాలూ వీరానులేపనాలూ మద్యమూ ఇప్పించవలెను. నీవున్నూ సంతోషముగా మద్యపానము చేయవలెను.

"రాక్షసులు రామలక్ష్మణులను చంపివేసినారు అనే వార్తను బాగా ప్రచారముచేయవలెను. అంతట నీవు సీతాదేవినిచూచి ఊరడించవలెను. ఏకాంతములో ఆమెకు నీవు మంచిమాటలు చెప్పవలెను. ధనాదులతోనూ రత్నాద్యాభరణాలతోనూ నీవు ఆమెను ప్రలోభపెట్టవలెను.

"రాజా, ఈ కపటోపాయమువల్ల సీతాదేవి తన భర్త పోయినాడు అని నమ్ముతుంది. ఆమె తన భర్త పోయినాడు అనే దుఃఖమువల్లనూ నీవు ఏమి చేస్తావోను అనే భయమువల్లనూ ఇదివరకు నీ మీద ఇష్టము లేకపోయినప్పటికిన్నీ మరి ఒక దారిలేక నీ వశము అవుతుంది. తన భర్త రాడు అనే నిరాశవల్లనూ స్త్రీ చాపల్యము వల్లనూ సీతాదేవి నీ వశముఅయి తీరుతుంది. ఆమె పుట్టినప్పటినుంచీ ఎంతో సుఖముగా పెరిగింది. ఎప్పుడూ సుఖము అనుభవించ వలసిన సీతాదేవి దుఃఖముతో కృశించి కుంగిపోయి ఉంది. అందువల్ల నీ వశము అయ్యేట్లయితే సుఖపడవచ్చును అనుకొని ఆమె నిన్ను ఆశ్రయిస్తుంది. నేను ఆలోచించి చూచినాను. నాకు ఈ ఉపాయము తోచింది. నీవు రాముడి ఎదుటికి పోవడము అపాయము. కాబట్టి నీవు యుద్ధానికి పోవద్దు. యుద్ధము చేయకుండానే నీ కోరిక ఇక్కడనే ఈడేరుతుంది. నీవు మహాసుఖము అనుభవించవచ్చును.

"రాజా, నీ సైన్యాలను నాశనము చేసుకోవద్దు. యుద్ధము చేయవద్దు. ప్రాణభయము లేదు. శత్రువును జయించు. బహుకాలము మహా ఐశ్వర్యము అనుభవించు. సుఖముగా ఉండు" అని చెప్పినాడు.

### ౬౫

మహోదరుడు చెప్పిన మాటలు కుంభకర్ణుడు విన్నాడు. అతనిని అటువంటి మాటలు చెప్పవద్దు అని బెదిరించినాడు. అంతట రావణాసురుణ్ణి చూచి "అన్నా, నేను ఇప్పుడే ఆ దురాత్ముణ్ణి రాముణ్ణి వధించి వేస్తాను. నీవు నిర్భయముగా ఉండు. ఇక శత్రువులు లేకుండా నీవు హాయిగా ఉంటావు. వాన కురవని మేఘాలవలె శూరులు వృథాగా గర్జించరు. నేను చెప్పినట్టుగా పోరాడుతాను. నీవు చూస్తావు. శూరులు తమను అవమానించే మాటలు అంటే విని సహించరు. తమను తాము పొగడుకోరు. ఇతరులకు ఎవరికీ చేయనలవికాని పనులు చేసి చూపిస్తారు.

"ఓ మహోదరుడా, నీ వంటి పిరికివాండ్లూ బుద్ధిలేని వాండ్లూ సమస్తమూ తెలిసిన పండితులము అనుకొనే అహంకారులూ చెప్పిన మాటలు విని మా అన్న రాక్షస రాజు రావణాసురుడు ఆపదల పాలు అయినాడు. యుద్ధము అంటే భయపడుతూ ఎప్పుడూ ఇచ్చకాల మారి మాటలు మాట్లాడుతూ రాజు చెప్పిన ప్రతిదీ బాగుంది అంటూ తిరిగి మీరు సీతాపహరణమూ అందువల్ల యుద్ధమూ తెచ్చిపెట్టినారు. రాజు, మిమ్ములను మిత్రులు అనుకొని నమ్మినాడు. మీరు నామమాత్రము మిత్రులవలె పయికి నటిస్తూ రాజుమీద మీ మనస్సులలో ఉన్న శత్రుత్వమునుంచి అతడు చెప్పిన ప్రతిదానికీ తలలు ఊపి అంతా తారుమారు చేసివేసినారు. మీ సంచి సైన్యము అంతా హతము అయిపోయింది. బొక్కసము అంతా క్షీణించి పోయింది. రాజు మిగిలి ఉన్నాడు. లంకాపట్టణము మిగిలి ఉంది. మీ దుర్నయాన్ని సరిచేయడానికి నేను ఇప్పుడు యుద్ధము చేయవలసి వచ్చింది. శత్రువులను జయించడానికి యుద్ధభూమికి పోతున్నాను" అని చెప్పినాడు.

ఇట్లా ఆ బుద్ధిమంతుడు కుంభకర్ణుడు చెప్పింది విని రావణుడు నవ్వుతూ, "నాయనా, కుంభకర్ణుడా, నీవు యుద్ధవిశారదుడవు. నాకు తెలుసును. ఈ మహోదరుడు రాముడికి భయపడి పోయినాడు. అందువల్ల యుద్ధమువద్దు అంటున్నాడు. నీ అంతటి బలవంతుడు ఈ లోకములో మరి ఒకడు లేడు. నీ వంటి బంధువూ స్నేహితుడూ నాకు మరి ఒకడు లేడు. నీవు పోయి శత్రువులను వధించు. జయించు. నీవు నా భయము పోగొట్టుతావు అనే నిన్ను నిద్రమేల్కొల్పించినాను. అరిందమా, నా వాండ్లు అయిన రాక్షసులు అందరూ యుద్ధము చేసి నన్ను సంతోషపెట్టడానికి ఇదే సమయము. నాయనా, నీవు నీ శూలము తీసుకో, పాశహస్తుడు అయిన యముడివలె పో. వానరులను అందరినీ వధించు. ఆదిత్యతేజస్సు వంటి నీ తేజస్సుతో దుర్ధర్షుడవు అయి రామలక్ష్మణులను భక్షించు.

"నాయనా, నీవు యుద్ధము చేయవలసిన అవసరమే ఉండదు. నీ మహాదాకారాన్ని చూసినా చాలు వానరులు అందరూ పరుగెత్తి పారిపోతారు. రామలక్ష్మణుల గుండెలు పగిలిపోతవి" అని చెప్పినాడు.

ఈ విధముగా రావణాసురుడు కుంభకర్ణుడితో చెప్పి తాను పునర్జన్మము ఎత్తినట్టు భావించుకొన్నాడు. కుంభకర్ణుడి బలమూ పరాక్రమమూ అతడు బాగా ఎరుగును. అందువల్ల సంతోషముతో స్వచ్ఛచంద్రుడి వలె తేజరిల్లినాడు. ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు అంతట యుద్ధము చేయడానికి బయలు దేరినాడు. అమిత వేగముతో శత్రువుల ప్రాణాలు తీసివేసే శూలాన్ని అందుకొన్నాడు.

ఆ శూలము ఉక్కుతో చేసింది. మేలిమి బంగారు అలంకారాలతో ధగధగలాడుతూ ఉంది. ఇంద్రుడు వదిలే పిడుగువలె అది భయంకరము అయింది. వజ్రాయుధమువలె అది కఠినము అయింది. అలంకారముగా కట్టిన పూలదండల నుంచి మహాతేజముతో నిప్పులు కక్కుతూ ఉన్నట్టుగానూ శత్రు రక్తములో తడిసి ఉన్నందువల్ల మంటలు మండుతూ ఉన్నట్టుగానూ కనిపించింది. ఆ శూలముతోనూ దేవదానవగంధర్వయక్షకిన్నరోరగులను అనేకమార్లు అదివరకు కుంభకర్ణుడు చంపి వేసినాడు. ఆ శూలాన్ని తీసుకొని రావణాసురుణ్ణి చూచి, "అన్నా, ఇప్పుడు నేను ఒక్కణ్ణే పోయి పోరాడుతాను. నా సైన్యాన్ని ఇక్కడనే ఉండనివ్వు, నా క్రుద్ధరూపాన్ని చూచి ఈ వేళ వానరులు అందరూ వ్యాకులపడిపోతారు. నేను వాండ్లను అందరినీ భక్షించి వేస్తాను" అని కుంభకర్ణుడు చెప్పినాడు.

ఇట్లా కుంభకర్ణుడు చెప్పింది విని రావణాసురుడు "నాయనా, నీవు సైన్యాలతో కూడా పోవడము మంచిది. శూలాలూ ఇనుప గుదియలూ తీసుకొని సైనికులు నీ వెంట ఉండవలెను. వానరులు అమిత పరాక్రమవంతులు. వేగవంతులు. ఒక్కని యుద్ధప్రయత్నము చేస్తారు. ఒంటరి వాణ్ణి కానీ ఏమరినవాణ్ణి కానీ వాండ్లు తమ కోరలతో కొరికి చంపివేస్తారు. అందువల్ల నీవు ఎదిరించవలని కాని మన సైన్యాలను వెంటపెట్టుకొని పో. రాక్షసులకు అపకారము చేసిన శత్రువులను అందరినీ రూపుమాపు" అని చెప్పి సింహాసనము మీది నుంచి లేచి రత్నాలు పొదిగిన బంగారు పూలహారాన్ని కుంభకర్ణుడి మెడలో వేసినాడు. అంతే కాకుండా బాహువులకు బాహుపురులూ వేళ్ళకు ఉంగరాలూ చెవులకు తళతళలాడే కుండలాలూ వరాభరణాలూ చంద్రహారాలూ ఇచ్చి దివ్యసుగంధము గుబాళించే పూలదండలు మెడలో వేసినాడు.

అంతట ఆ పెద్ద పెద్ద చెవుల కుంభకర్ణుడు బంగారు బాహుపురులతోనూ అనేక వరాభరణాలతోనూ అలంకరించుకొని వేల్చిన అగ్నిహోత్రము వలె తేజరిల్లినాడు. అమృతమంథన సమయములో వాసుకిని చుట్టిన మందరపర్వతము వలె నల్లటి మొలతాడుతో కనిపించినాడు. ధగ ధగలాడుతూ ఉన్న బంగారు కవచము తొడుగుకొన్నాడు. అది చాలా బరువు అయింది. గట్టిది. పర్వతాలతో కొట్టినా అది పగిలి పోదు. గాలి లోపలికి దూరదు. మంటలు మండుతూ ఉన్నట్టుగా ఉన్న ఆ బంగారు కవచము తొడుగుకొన్న కుంభకర్ణుడు సంధ్యాకాల మేఘాలు కమ్ముకొన్న హిమవత్పర్వతము వలె భాసించినాడు. సమస్తాంగాలకూ పెట్టుకో వలసిన సర్వాభరణాలూ పెట్టుకొన్నాడు. చేతులలో శూలము తీసుకొన్నాడు. మూడు అడుగులు వేయడానికి విజృంభించిన త్రివిక్రమ నారాయణ మూర్తి వలె కుంభకర్ణుడు అప్పుడు కనిపించినాడు. ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు అంతట తన అన్నను రావణాసురుణ్ణి కౌగలించుకొన్నాడు. పోరాటానికి పోతూ అతనికి ప్రదక్షిణము చేసి సాష్టాంగనమస్కారము చేసినాడు.

పోరాటానికి అట్లా బయలుదేరి పోతున్న ఆ మహాకాయుణ్ణి ఆ మహాబలవంతుణ్ణి మహానాదము చేసే ఆ కుంభకర్ణుణ్ణి రావణాసురుడు ఆశీర్వదించినాడు. అప్పుడు శంఖాలు పూరించినారు. దుందుభులు మోగించినారు. ఆ రథికశ్రేష్ఠుడు కుంభకర్ణుడు అప్పుడు యుద్ధభూమికి ప్రయాణము అయినాడు. అతని రథము వెంట మేఘగంభీరధ్వనులు చేస్తూ రథాలూ ఏనుగులూ గుర్రాలూ వివిధవరాయుధాలూ ధరించిన సైన్యాలూ నడిచినవి. గొడుగు వేసుకొని శూలము చేతిలో పట్టుకొని రక్తగంధము అద్దిన మహాకాయముతో స్వాభావిక మదముతో పోరాటానికి పోతూ ఉన్న ఆ కుంభకర్ణుడిమీద రాక్షసాంగనలు పూల వాన కురిపించినారు.

ఆ కుంభకర్ణుడి వెంట మహానాదాలు చేస్తూ బయలుదేరిన పదాతులు మహాబలవంతులూ, భయంకరాకారులూ, భయంకర రక్తనేత్రులూ, కాటుక రాసుల వంటి మహాకాయులూ, వాండ్లు అందరూ శూలాలూ ఖడ్గాలూ పదును పెట్టిన గండ్రగొడ్డళ్ళూ పెద్ద పొడుగాటి ఇనుప గుదియలూ గదలూ ముసలాయుధాలూ లావుపాటి తాటి బోదెలూ సమీపించడానికి అలవి కాని క్షేపణీయాలూ అనే ఆయుధాలూ పట్టుకొని పోయినారు.

అట్లా యుద్ధభూమికి పోతూ ఉన్న ఆ మహాపరాక్రమవంతుడు మహాబలవంతుడు కుంభకర్ణుడు అప్పుడు తన రూపాన్ని మరింత భయంకరంగా మార్చుకొన్నాడు. ఒళ్ళు గగుర్పొడిచే మహాభయంకరము అయిన మహాదాకారము ధరించినాడు. బండి చక్రాలు అంతటి కన్నులతో నూరు ధనుస్సుల వెడల్పూ ఆరునూరు ధనుస్సుల పొడుగునా చెట్లూ చేమలూ తగులబడిపోయిన మహాపర్వతమువలె కనిపించినాడు. నోరు తెరిచి నవ్వుతూ తన వెంట వస్తూ ఉన్న రాక్షసయోధులతో "ఓ యోధులారా, నాకు ఇప్పుడు చాలా కోపముగా ఉంది. వానర ముఖ్యులనూ వానర సమూహాలనూ అగ్నిహోత్రుడు మిడుతలను వలె నేను ఇప్పుడు రూపుమాపి వేస్తాను. అడవులలో తిరిగే వానరులు నాకు ఏ అపరాధమూ చేయలేదు. పయిగా వానరజాతి వాండ్లు మా వంటి వాండ్ల పురోద్యాన వనాలకు అలంకారముగా ఉంటారు. అయితే వానరులు అందరూ లంకా పట్టణాన్ని ముట్టడించినారు. అందుకు కారకులు రామలక్ష్మణులు వాండ్లను ఇద్దరినీ వెంటనే చంపివేస్తాను. వాండ్ల వెంట వచ్చినందుకు వానర వీరులను అందరినీ భక్షించివేస్తాను" అని చెప్పినాడు.

అట్లా కుంభకర్ణుడు చెప్పగానే సంతోషాతిశయముతో రాక్షసులు అందరూ సముద్రము కంపించి పోయేట్టు మహాభయంకరముగా గర్జించినారు.

ఆ ధీమంతుడు అట్లా అనుచరులతో చెప్పి అమిత వేగముతో పోరాటానికి పోతూ ఉంటే ఘోరము అయిన అపశకునాలు అన్ని వైపులా అగుపించినవి. మేఘాలు కంచర గాడిదలవలె ఎర్రటి రంగులో కనిపించినవి. ఆ మేఘాలలో నుంచి కొరవులు పిడుగుల ధ్వనులలో కింద పడ్డవి. సముద్రములోనూ వనాలతోనూ భూమి కంపించింది. మహాభయంకరాకారాలతో ఉన్న నక్కలు నోళ్ళలో నుంచి మంటలు కక్కుతూ అరిచినవి. పక్షులు బారులుకట్టి అపసవ్యమండలాకారముగా ఆకాశములో తిరుగ సాగినవి. వాటిలో గద్దలు పంక్తులు పంక్తులుగా నేలమీద వాలినవి. అప్పుడు కుంభకర్ణుడి ఎడమ కన్నూ ఎడమ భుజమూ అదిరినవి. మంటలు మండుతూ భయంకరధ్వని చేస్తూ ఒక కొరివి ఆకాశమునుంచి పడ్డది. సూర్యుడి కాంతులు మాసిపోయినవి. హాయిగా వీస్తూ ఉన్న గాలి ఆగిపోయింది. ఒళ్ళు గగుర్పొడిచే మహోత్పాతాలను యముడు తోసుకొని పోతూ ఉన్నందువల్ల కుంభకర్ణుడు లెక్కచేయలేదు. అంతట అతడు లంకాప్రాకారాన్ని దాటి మేఘసమూహమువలె అద్భుతముగా ఉన్న వానరవాహినిని చూచినాడు.

అప్పుడు ఆ పర్వతాకారుణ్ణి వానరులు అందరూ చూచినారు. గాలి తరుముకొనిపోయే మేఘాలవలె వానరులు అందరూ చెల్లాచెదరు అయి అన్ని దిక్కులా పరుగులెత్త సాగినారు. తనను చూడగానే ఆ ప్రచండవానరవాహిని పరుగులెత్తడము ఆ మహామేఘాకారుడు కుంభకర్ణుడు చూచి సంతోషాతిశయములో మహామేఘమువలె గర్జించినాడు. ఆ భయంకర సింహనాదానికి మూలము నరికివేసిన పెను చెట్లవలె వానరయోధులు అనేక వేలమంది నేలకూలినారు. ఆ మహాకాయుడు కుంభకర్ణుడు లావాటి ఇనుపగుదియ పట్టుకొని ప్రళయకాలములో దండధరుడు అయి కింకరులను వెంటపెట్టుకొని పోయే యముడివలె వానరవాహినీ సమూహాలమీదికి పోయినాడు.

### ౬౬

అమితవేగముతో లంకాపట్టణ ప్రాకారము దాటిపోయిన ఆ పర్వతాకారుడు కుంభకర్ణుడు సముద్రము చెలరేగి మహాఘోషము చేస్తూఉన్నట్టూ పిడుగులు పడుతూఉన్నట్టూ పర్వతాలు అన్నీ పగిలిపోతూ ఉన్నట్టూ మహాభయంకరముగా సింహనాదము చేసినాడు.

దేవేంద్రుడూ వరుణుడూ యముడూ వధించలేకపోయిన ఆ భయంకర నేత్రుడు తమమీదికి రావడము వానరులు అందరూ చూచినారు. పరుగులెత్తి పారిపోవడము మొదలుపెట్టినారు. అట్లా పారిపోతున్న వానరులను అందరినీ అంగదుడు చూచినాడు. అంతట వారిలో బలవంతులు అయిన నలుణ్ణీ నీలుణ్ణీ గవాక్షుణ్ణీ పిలిచి "ఓ వానరవీరులారా, మీరు అందరూ బలవంతులు, గొప్ప వంశాలలో పుట్టినారు. ఇది ఏమిటి నీచ వానరులవలె మీరు అందరూ ఇప్పుడు ఎక్కడికి పరుగులెత్తుతున్నారు. ఎక్కడికి పారిపోతారు. శూరులకు ప్రాణము కన్నా మానము అధికము, పోరాడటానికి రండి, ప్రాణాలు కాపాడుకొని ఏమిచేస్తారు. ఇంతకూ ఈ కనపడుతున్నవాడు యుద్ధముచేయడానికి వచ్చిన రాక్షసుడు కాడు. ఇది ఒక విభీషిక, మనలను భయపెట్టడానికి రాక్షసులు వెంటపెట్టుకొని వచ్చిన ఒక యంత్రము, ఒక పెద్ద బొమ్మ. మనము మన పరాక్రమముతో దీనిని ధ్వంసము చేసివేదాము, బయలుదేరండి, పదండి" అని అంగదుడు చెప్పినాడు.

ఎంతో కష్టముమీద వానరులు అందరూ ధైర్యము తెచ్చుకొన్నారు. అందరూ మెల్లగా ఏకము అయినారు, వృక్షాలూ పర్వతశిఖరాలూ తీసుకొని క్రుద్ధులుఅయి మళ్ళీ యుద్ధభూమికి ప్రయాణములుఅయి పోయినారు. మదముఎక్కి చెలరేగిన మదపుటేనుగులవలె కుంభకర్ణుడిమీదికి పోయినారు, పొడుగాటి పర్వతశిఖరాలతోనూ పెద్ద రాళ్లతోనూ చావతేలిన చెట్లతోనూ కుంభకర్ణుణ్ణి కొట్టినారు, అందుకు ఆ రాక్షసుడు చలించలేదు. అంతేకాదు, వానరులు విసరివేసిన పర్వతశిఖరాలూ పెద్ద పెద్ద రాళ్లూ మహావృక్షాలూ ఆ కుంభకర్ణుడి దేహాన్ని తాకి ముక్కలు ముక్కలు అయి నేలమీద పడిపోయినవి.

అంతట కుంభకర్ణుడు కుపితుడు అయిపోయినాడు. అడవిలో చెట్లను అన్నిటినీ కార్చిచ్చు వలె ఆ మహాబలవంతుడు వానరులను అందరినీ చంపి వేయడము మొదలు పెట్టినాడు. ఆ రాక్షసుడి దెబ్బలకు గాయాలు అయి దేహము అంతా నెత్తురుతో తడిసి పోయి ఎంతో మంది వానరులు నేల కూలి ఎర్రటి పూల చెట్ల వలె కనిపించినారు. అట్లా దెబ్బలకు నేల కూలకుండా మిగిలి పోయిన వానరులలో కొందరు వెనకకు తిరిగి చూడకుండా ఒకరి మీది నుంచి ఒకరు దూకి పరుగెత్తి పారి పోయినారు. అబలవంతుడి దెబ్బలకు ఓర్వ లేక కొందరు వానరులు సముద్రములో పడి పోయినారు. కొందరు సేతువు మీదికి పరుగెత్తినారు, కొందరు ఆకాశానికి ఎగిరి పోయినారు: కొందరు భయముతో ముఖాలు వెలవెల పోతూ మిట్టలకు పరుగులెత్తినారు. కొందరు పల్లాలకు పరుగులెత్తినారు. భల్లూకవీరులు కొందరు చెట్లు ఎక్కినారు. ఆ భల్లూకవీరులలో కొందరు కొండలు ఎక్కినారు. ఆ వానరులలో కొందరు సముద్రములో మునిగి పోయినారు. కొందరు కొండ గుహలలో దాగుకొన్నారు. కొందరు నేల మీద కూలబడి పోయినారు. కొందరు ఉన్న చోట ఉండ లేక అదే తీరున పరుగెత్తినారు. కొందరు చేష్టలు తప్పి మూర్ఛ పోయినారు.

పరాజితులు అయి అట్లా పారిపోతూ వున్న వానరులను అందరినీ అంగదుడు చూచి "ఓ వీరులారా, నిలవండి, పారిపోవద్దు. వెనకకు మళ్ళండి. మనము పోరాడుదాము. మీరు యిట్లా భయపడి పరుగులెత్తి ఈ భూమి అంతా తిరిగినా మీరు బ్రతికి ఉండడానికి ఎక్కడనూ చోటు దొరకదు. తిరిగి రండి. ప్రాణాలు కాపాడుకొన్నందువల్ల ప్రయోజనము ఏమిటి.

"ఓ వీరులారా, ఇదివరకు మీ పరాక్రమాన్ని ఎవరు అడ్డగింపలేరు. ఏ యుద్ధములోనూ మీరు అపజయము ఎరగరు. మీరు యిప్పుడు ఆయుధాలను పారవేసి పారి పోతే మీ భార్యలే మిమ్ములను ఎగతాళి చేస్తారు. పెండ్లాల చేత ఎగతాళి చేయించుకోడము కన్నా యుద్ధములో చచ్చి పోవడమే మేలు. మనము అందరమూ శివాంశసంభూతులము. నీచులవలె భయపడి మీరు అందరూ ఎక్కడికి పోతారు. మీరు ఇప్పుడు కుంభకర్ణుడికి భయపడి మీ పరాక్రమాన్ని వదిలి పెట్టి పారిపోతున్నారు. అందువల్ల అయోగ్యులు అవుతారు. మీరు ఇదివరకు అందరి ఎదటనూ మేము ఇంత వాళ్లము అంత వాళ్లము అని చెప్పుకొన్నారు. ఆ ఆత్మస్తుతులు అన్నీ ఇప్పుడు ఎక్కడికి పోయినవి.

"పరాజితులు అయి ప్రాణాలతో వుంటే వారిని అందరూ పిరికిపందలు అని పిలుస్తారు. అట్లా పిలిపించుకొనే కంటే చచ్చి పోవడము మేలు. శూరులూ వీరులూ పోయే దారినే మనమూ పోదాము. మీరు యిప్పుడు భయాన్ని అవతలకు తోసి వేయండి. మనము అల్పాయుష్కులము అయి ఒక వేళ యుద్ధములో చచ్చి పోయినట్లయితే సామాన్యులకు ఎవరికీ పోవడానికి వీలులేని బ్రహ్మలోకానికి పోతాము. మనము ఒక వేళ యుద్ధములో జయించేట్లయితే అఖండము అయిన కీర్తి వస్తుంది.

ఓ వీరులారా, మనము ఈ కుంభకర్ణుడివల్ల చచ్చిపోము. మంటలు మండుతూఉన్న అగ్నిహోత్రముమీదికి పోయే మిడుత ప్రాణాలతో తిరిగిపోదు. అదేవిధముగా ఆ రామప్రభువును చూడపోయే వీడు ప్రాణాలతో తిరిగిపోడు.

అంగదుడు ఈవిధముగా చెప్పుతూఉంటే భయపడిపోయిన వానరులు "ఓ యువరాజా, కుంభకర్ణుడు మమ్ములను ఘోరముగా మర్దించినాడు. మేము నిలవలేము. పోతున్నాము. ఎట్లాగో బ్రతికిఉంటాము" అన్నారు. వానరయోధులు ఇట్లా చెప్పుతూ ఉండగా కుంభకర్ణుడు అక్కడ కనిపించినాడు. ఆ భయంకర నేత్రుణ్ణి, ఆ భయంకరాకారుణ్ణి చూచి వానరయోధులు పరుగులెత్తి పోయినారు. అంగదుడు అంతట మంచిమాటలతోనూ అనేకదృష్టాంతాలతో ఆ వానరయోధులను అందరినీ పారిపోనీయకుండా చేసినాడు. అప్పుడు వారికి అందరికీ తోడుపడడానికి హనుమంతుడు అక్కడికి వచ్చినాడు. అంతట ఆ వానరయోధులు అందరూ పరమసంతోషముతో సుగ్రీవాజ్ఞను ఎదురుచూస్తూ మళ్ళీ యుద్ధసన్నద్ధులు అయినారు.

అప్పుడు హనుమంతునివెంట ఋషభుడూ శరభుడూ మైందుడూ ధూమ్రుడూ నీలుడూ శాఖుడూ నీలుడూ కుముదుడూ సుషేణుడూ గవాక్షుడూ రంభుడూ ద్వివిదుడూ పనసుడూ యుద్ధాభిముఖులు అయినారు.

# కవిత్వంలో పోలికలు

(5 వ పేజీ తరువాయి)

'సుప్తాస్థికలు' ఆ తరగతిలోనివే.

విశ్వనాథ సత్యనారాయణగారి శృంగారవీథిని చదువుచుంటిని. అది యేమి చిత్రభావము! జంతువులవలె ప్రకృతి పురుషులు సిగ్గువిడిచి ఆ విహరించుట ఏమి అని కొంత వింత కొంత జుగుప్స పొంది, ఇందు ఔచిత్యము పాటింపబడలేదా అనుకొంటిని. కొన్నాళ్ళకు బృహదారణ్యకోపనిషత్తు చూచితిని. ఆశ్చర్యమైనది. ప్రథమమున విరాట్టు ఒక్కడే ఉండెను.

'సద్వై తైవరేమే తస్మాదేకాకీ నరమతే, సద్వితీయ మైచ్ఛత్ I
...తాం సమభవత్ I తతో మనుష్యా అజాయంత I సాహేయ మీక్షాం చక్రే I కథంను మాత్మ ఏవ జనయిత్వా సంభవతి? హంతి తిరోహానీతి; సాగౌరభవత్, ఋషభ ఇతరః I తాం సమే వాభవత్ I తతో గావో అజాయంత I. వడబేతరాభవత్, అశ్వ వృష ఇతరః I గర్దభీతరా గర్దభ ఇతరః I తాం సమే వాభవత్ అజేతరా భవేత్, వస్త ఇతరః I అవి రితరా, మేష ఇతరః I తాం సమేవాభవత్ I తతో జావయో జాయంత I ఏవమేవ యదిదంకించ మిథునమ్, ఆపిపీలికాభ్యః తత్సర్వ మసృజత II'

ఒక్కనికి రంజనము లేకపోయెను. అతడు రెండవ వ్యక్తిని గోరెను. ఆమెతో కలిసెను. మనుష్యులు పుట్టిరి. ఆమె విచారించినది. 'నన్ను పుట్టించిన వాడు నాతో కలిసినాడేమి? తిరోహితనగుదును' అని అస్తనది. అతడు వృషభమై కలిసినాడు. గోజాతి పుట్టినది. ఆమె అశ్వమైనది. అతడు మొగ గుఱ్ఱమైనాడు. ఆమె ఆడ గాడిద అయినది. అతడు మొగ గాడిద అయినాడు. కలిసినాడు. అట్లు ఒంటిగిట్ట జంతువులు పుట్టినవి. ఆమె ఆడ మేక అయినది. అతడు మేకపోతయ్యెను. ఆమె గొఱ్ఱె అయినది. అతడు పొట్టేలయ్యెను. వారు కలిసిరి. మేకలు గొఱ్ఱెలు పుట్టినవి. ఈ రీతి మిథునము లగ పిపీలికముల పర్యంతము విస్తరించి సృష్టి జరిపిరి.]

ఇది జూచిన తరువాత శృంగారవీథిలో నాకు విడ్డూరము తోచలేదు.

షెల్లీ వ్రాసిన Ode to the West wind అను ఖండకావ్యమును జూడుడు.

Ode అనునది ఆంగ్ల ఖండకావ్యములందొక విధము. దీనికి గ్రీకు వాఙ్మయము మూలము. ఉదాత్తముగా గంభీరముగా నుండును. ఎత్తిన వస్తువును సంబోధించి నడచును. శైలివస్తువు ఉదాత్తము. కవి భావావేశమున మునిగి మహోన్నతముగా బలుకును. తన శక్తి నంతను జూపుచున్నట్లుండును. విశదముగ గాఢముగ ఉన్నతముగ గంభీరముగ కవి వాక్కు నడచును.

West Windలో అయిదు పద్యములు కలవు. 'ఓ పశ్చిమ పవనమా! నీవు ప్రాణమునూదించు వు. ప్రాణము నిర్తువు. చెట్లఆకులను రాల్చుచున్నావు. ఆకులతో పాటు గింజలను కొనిపోయి తగిన తావుల దాచుచున్నావు. అవి సకాలమున మొలుచుచున్నవి. భూమి యందిట్లు చేతువు. గగనమున మేఘములనుగూడ ఆకులట్లే చెల్లా చెదరు చేతువు. మేఘముల కూర్చి వర్షము గురియుటకు తోడ్పడుదువు. సముద్రమును మేల్కొల్పుదువు. సముద్రగర్భమున దాగిన నగరములు వణకునట్లు కదల్చుదువు.

నేనొక ఆకునైన, మేఘ శకలమునైన, సముద్రతరంగమునైన బాగుండును. నీ అప్రతిహతశక్తి తట్టుకొన లేకున్నది. నా చిన్నతనము నాటి శక్తి నిప్పుడు కోల్పోతిని. కావున నన్ను ఆకునువలె మేఘమును వలె తరంగమును వలె పైకెత్తుము. జీవిత కంటకముల బడి గాయపడితిని. చెట్టునుండి ఆకులు రాలునట్లు నా ఊహలు రాలిపోవుచున్నవి. నన్ను ఒక వాద్యమునుగా నీవు ప్రయోగింపుము. రాలిన నా ఊహలు జగమున విస్తరిల్లి నూతనసృష్టికి హేతువులు కాగలవు.'

ఇట్లు అయిదు పద్యములలో సాగిన షెల్లీ రచనము ఆంగ్ల వాఙ్మయమున మహోన్నతముగ గొప్పదిగ కీర్తింపబడును.

శంకరుడు చిత్తమును సంబోధించుచు అయిదు పద్యముల మహోదాత్త కావ్యమును రచించినాడు.

'చిత్తమునెకి ఓ తుమ్మెదా! రసరహితమయిన ఈ మరుభూమిలో దప్పి గొన్నదానివై తిరిగిన ఏమి లాభము. ముత్తైపులోని జెండి మొలుకులతో వగలు చేయించుకొన గలవేని ఈ భవమున సుఖమును బొందుదువు.

రూపముయొక్క పోలికను జూచి బూరుగుపువ్వును మొట్టతామర అనుకొంటివి. ఇందు పరిమళముగాని రసముగాని లేవుకదా. పాపము విరర్థకముగా శ్రమపడుచున్నావు. నీ దప్పి తీరదు సుమా...

పూలదండలు మంచిగంధము స్త్రీలు మొదలయినవి సుఖముకూర్చునని తలచి ఇక్కడ విహరించుచున్నావు.

ఇవన్నియు సంపెగవంటివి. రసరహితములు. భోగానంతరము నీకు దుఃఖము నే తెచ్చిపెట్టును.

నీకు సుఖపడవలయునని కొంతయున్నచో హితమయిన వాక్యము నొకదానిని చెప్పెదను. ఆలింపుము.

స్వప్నమున నీవు చూచిన దంతియు అబద్ధమని ఎరుగుచున్నావుకదా. అట్లే జాగ్రత్తలో జూచినదంతియునని యెఱుగుము. స్వామి పాదపద్మములలో మరందమున్నది. దానిం జేరి నీదాహము నార్పుకొని సుఖింపుము.

శంకరుని ఈ అయిదు శ్లోకములలో నడచిన రచన ఒక గొప్ప 'Ode' అని నేను భావింతును. షెల్లీ West Wind చదివినప్పుడు శంకరుని పై రచనము నేను స్మరింతును.

పూర్వకావ్య స్మృతిలేక కావ్యరచన సాగదు. తెలిసి పడునవి కొన్ని. తెలియక పడునవి కొన్ని. ఒకనాడు 'తుంబుర తీగలన్——'అని నడచిన నా పద్యమును రాయప్రోలువారు చదువుచు అక్రిందటిరాత్రి తాము 'తుంబుర తీగలని——'అని ఆరంభించి వ్రాసిన పద్యమును తెచ్చి చూపిరి. ఇది దైవికము.

నా మిత్రుడొకడు——

హృదయము మోదమందెడి మహిన్ జననమ్ము నిరర్థకమ్ముగా
నడవిని లాడి తిందనుక,
ఆటవిక స్ఫుట సౌరభ ప్రసూ
నదళవిరాగమో, జలధి
నాటి బయల్ గనలేని రత్న ని
ర్మద పరితాపమో వృథము
రాణ లభింప దటంచు ఖిన్నమై.

అను నా కావ్యములో పద్యము నొకదానిని దెచ్చి,

Full Many a flower is born
to blush unseen
...................................
in the desert air
Full Many a gem of purest
ray serene
In the dark unfathomed caves
of ocean bear-

అను Thomas Gray వ్రాసిన Elegy లోని పద్యముతో సామ్యమును జూపినాడు. నే సంగీకరించితిని. భావములు చదువుటలో లోనజేరి కాలము కడచిన పిమ్మట అప్రయత్నముగా మన స్వకీయములట్లే వచ్చుటయు మన మనుకొని వ్రాయుటయు పైరీతి అప్పుడప్పుడు జరుగుచుండును.

కాని, పదములు అట్లే వచ్చిన చోట్లు చూడుడు. విశ్వనాథ వారి స్వర్గానికి నిచ్చెనలు చూచుచుండగా 'అది విషవిసర్పమూ మదనూ' అని కనబడినది. భవభూతి 'కిము విష విసర్పః కిము మదః' గుర్తునకు వచ్చినది. మరియొకచోట 'ధూమజ్యోతి స్సలిల మరుత్తులు' అని చూచితిని. కాళిదాసుని మేఘసందేశమందలి 'ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః' అనునది స్మృతికి వచ్చినది.

'పూల'ను గురించి నేను కనబడుచున్న సుకుమార భావములకు కర్త మొదట తెలుగున శ్రీనాథుడనిపించినది. ఆయనపద్య మాలింపుము:

[illegible]





# సుఖం తెచ్చిన సమస్యలు

పారిశ్రామిక విప్లవంతో ఆధునిక నాగరికత ప్రారంభమైనదనవచ్చు. పరిశ్రమలు అభివృద్ధి చెందడంతో మానవసమాజం నూతన సమస్యలను ఎదుర్కొన్నది. అనేకమంది మనుషులు చాలా కాలం చాలా శ్రమించి చేయవలసిన పనులు కొద్ది కాలంలో కొద్ది శ్రమతో చేసుకొనగలగడం సాధ్యమైనది. మానవుని సుఖాన్ని ఎక్కువ చేయడానికి సాధనలుగా ఏర్పడిన యంత్రాలకు అధిక ప్రాముఖ్యమిచ్చి ప్రతి విషయాన్ని, కృషిని యంత్రాల దృష్టిలో పరిశీలించడం ప్రారంభమైంది. ఈ పరిశీలన కొత్తయంత్రాల అన్వేషణకు దోహదమిచ్చింది. యంత్రాలను కనిపెట్టే కృషిలో, జిజ్ఞాస పర్యవసానంగా కొత్తకొత్తయుగా మానవ సమాజాన్ని తుదముట్టించే మారణాయుధాలు తయారైనవి.

అయితే యంత్రాలసోజా ఎక్కువయింది.

వాస్తవానికి యంత్రాలకు యివ్వవలసిన ప్రాముఖ్యమే యిస్తే యిట్లా జరగవలసిన పనిలేదు.

చిన్న పనికీ, పెద్ద పనికీ యంత్రాలనే వినియోగించే దేశాలసంగతి అట్లా ఉంచగా చెప్పుకోదగ్గ పెద్ద పరిశ్రమలు ఇంకా అంత యెక్కువగా యేర్పడని దేశాలలో, అభ్యున్నతి కార్యకలాపాలను అమలు చేయడానికి కావలసినంత మంది మనుషులున్న దేశాలలో యీ సమస్య మరీచిత్రంగా తయారయింది. ఉత్పత్తి పెంచాలనే కోరిక వున్నది. మంచిదే. అయితే ఉత్పత్తి యెందుకు? మనుషులు సుఖపడడానికి. మనుషులే వస్తువులను తయారుచేసుకోగల పరిస్థితిలో, యంత్రాలను వాడితే వృత్తులు పోయి నిరుద్యోగు లెక్కువమంది తయారయ్యే పరిస్థితిలో భారీయంత్రాల కోసం పెర పెరలాడడం అవసరమే గదా?

ఇంత చిన్న విషయం తెలిసిన ప్రవీణులుకూడా యంత్రాలను ప్రోత్సహించాలనడానికి కారణం లేకపోలేదు. ఇట్లా వాదించేవారుకూడా మానవులసుఖం ఎక్కువ కావాలనే అంటారు. అయితే ఏ మానవులు? మానవ సమాజం అంటే సరయిన సమాధానం కావాలదు.

## వర్గశ్రేయస్సు

శ్రేయస్సుమాటూడా వర్గదృష్టితో లెక్కించి ఫలానివారికి శ్రేయస్సు కలగడమే మానవులందరికి శ్రేయస్సు అనడం ఆధునిక నాగరికతా పరిణామంలో వచ్చిన సాంస్కృతిక సమస్యలలో ప్రధానమైనది.

ఈ విధంగా ఆర్థిక, సాంస్కృతిక రాజకీయాది రంగాలలో చిత్రవిచిత్ర రూపాలలో ప్రత్యక్షమవుతున్న సమస్యలవల్ల ప్రపంచమంతా మానవ సమాజ శ్రేయస్సుదృష్టి నలవరచుకోవాలనే ఆకాంక్ష ఇప్పుడిప్పుడే కొద్ది కొద్దిగా మళ్ళీ కనిపిస్తున్నది.

నిజానికి మానవుని అంటే వ్యక్తి సుఖాన్ని ప్రధానంగా పెట్టుకు కృషి చెయ్యాలనే సిద్ధాంతం కొత్తదేమీ కాదు. అది మానవుని నాటినుంచి ఈ నాటి వరకు పరిసరాలతో, ప్రకృతితో మానవుడు సాగించుతున్న జిజ్ఞాసకు ఈ దృక్పథమే ప్రధాన కారణం. ఎవరికి వారు తాము సుఖంగా ఉండాలనే కోర్తారు. కష్టపడాలని ఎవరూ కోరుకోరు. అయితే తమసుఖం ఇతరులకు కష్టంగా పరిణమిస్తుందని కొందరికి తెలియక పోవచ్చు. కాని, తెలిసికూడా కావాలని ఇతర్లను కష్టపెట్టి తమసుఖాన్ని ఇంకా ఎక్కువ చేసుకోవాలని ప్రయత్నించడం మానవ వాదసంప్రదాయాలకు విరుద్ధం.

పరస్పర సంఘర్షణలు తప్పవనే సిద్ధాంతానికి ఈనాడు శాస్త్రీయంగా బలం కనిపించదు. సంఘర్షణతో పని లేకుండానే పరిణామం సాధ్యమనేది శాస్త్రీయంగా ఋజువైంది. కనుకనే చిన్న చేపలను పెద్దచేపలు తిన్నట్లే లేని వారి సుఖాన్ని బలిచేసుకుని కలవారు తమ సుఖాన్ని ఇంకా ఎక్కువ చేసుకుంటామనే వాదానికి ఈనాడు ప్రాబల్యంతగ్గింది. ఆశయంఅదేఅయినా ఇదివరకు మాదిరిగా "ఎవరు ఎట్లాపోతే మాకేం" మాకు కావలసింది మాసుఖమే నని చెప్పుకు తిరిగే అవకాశం ఈనాడు కనిపించదు. అందుకనే ఇష్టం లేకపోయినా "మేంచేసే పనికూడా సమాజశ్రేయస్సాధనేనని" మానవసమాజము సంగతి అంతగాపట్టనివారుకూడా చెప్పుకోవలసివస్తోంది. అంటే స్థూలముగా మానవ సంప్రదాయాలకు ప్రపంచంలో ఈనాడు తిరిగి ప్రాబల్యం ఏర్పడుతోందన్నమాట.

## "మానవత"

ఏరంగంలో చూచినా ఈనాడు ఒక దకంరోభ కనిపిస్తుంది. ఈ షోభలో నిజాయితీగా జిజ్ఞాస చేసేవారందరు కోరుతున్నదొక్కటే. సమాజంలో ని ప్రతివ్యక్తి సుఖపడాలి. సుఖమో కష్టమో అందరికి సమానంగా అనుభవంలోకి రావాలి. ఈవిధంగా ప్రపంచంలో మానవతావాదానికి నానాటికి ఒకరకం ప్రాబల్యం కనిపిస్తోంది.

అయితే ఈనాడు కనిపిస్తున్న ఈసంక్షోభం పైపైమెరుగేనా? లేక నిజంగా ఆధునిక నాగరికత తయారుచేసిన సమస్యలను పరిష్కరించాలనే వాంఛ ప్రబలమవుతున్నదా? పైపైమెరుగే అయినా ఇబ్బందేమీలేదు. ఒక్కసారిగా మార్పు రాదు. మార్పు అనేదికూడా క్రమంగానే రూపొందుతుంది. కనుక సమాజస్వరూపాన్ని మార్చేకృషిలో—అంటే వ్యక్తి ఇకముందు తన ఆలోచనలను, ఆశయాలను నిర్ణయించుకోవడంలో ఇది ప్రధానదశ. అనేకానేకాలు, దుందుడుకులేని నిబ్బరమైన కార్యకారణ జిజ్ఞాస, హేతువాదదృష్టి ఈదిశలో విరివిగా ప్రచారంకావాలి. లేకపోతే ఈ సంచలనమంతా వృథాప్రయాసగా మరిపోయే ప్రమాదమొకటి ఉన్నది.

## "హ్యూమనిస్టు"

## విశుద్ధ వర్తన

సమాజ కార్యకలాపాలన్నీ ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉంటవి. ఇది రాజకీయము, మరిది ఆర్థికము అని కేవలం ఆయా సమస్యల స్వరూప స్వభావాలను అర్థంచేసుకుని పరిష్కారముల నన్వేషించడానికి మాత్రమే విడదీయడం జరుగుతున్నది. కనుకనే రాజకీయాలలో విశుద్ధవర్తన అవసరమనే ఆందోళన ఇంతగా ఎక్కువైంది. ఏది విశుద్ధవర్తన అనే జిజ్ఞాస కూడా జరుగుతున్నది.

ఈ జిజ్ఞాస ఆశించేదేమిటి? పరస్పర సహకార సమన్వయ జీవితం. ఎన్నో విషయాలలో ఆశాభంగం కలిగి "జీవితం ఇట్లాయితే లాభంలేదు. మరో విధంగా వ్యవహరించాలని" అంటున్నారు. అట్లా అనే వారి నిజాయితీని శంకించ నవసరం లేదు. తాత్కాలికంగానే అయినా ఇప్పటి జీవిత విధానం సంతృప్తికరంగా లేదనే భావం ప్రబలింది. కాని, "ఇంతకంటే బాగా, ఎక్కువ సుఖం కలిగేట్టు వ్యవహరించాలనే ఆందోళన" చాలా వరకు ఆడవి రోదనమే అవుతున్నది ఎందుకని?

పరిశ్రమలు అభివృద్ధి చెందడంతో పాటు మానవుని ఆలోచన పద్ధతి మారలేదు. ఆలోచనా పద్ధతి మారకముందే పరిశ్రమలు అభివృద్ధి చెందడం వల్ల అది పరకటి సమ్మకాలకొకసవాలువచ్చింది. అనమ్మకాలను పూర్తిగా వదులుకోలేదు. పరిశ్రమలవల్ల వచ్చిన విజ్ఞానాన్ని పూర్తిగా నమ్మలేదు. పరిశ్రమల విజ్ఞానం అన్నివేళలా అన్ని సమస్యలను పూర్తిగా పరిష్కరించ లేక పోవడం వల్ల జీవితంలో ఒక రకం నిరాశా భావం ఏర్పడింది. ఆ నిరాశాభావం వల్ల ప్రతి విషయాన్ని అర్థంలేకుండా అనుమానించడం ఎక్కువైంది. నీరులేని రాయలసీమ వంటి ప్రాంతాలకు కృష్ణానదినుంచి నీరు సప్లయి చేయడానికి యంత్రాలు ఉపయోగపడ్తవని ఉదాహరణ పూర్వకంగా చెప్పినా "అ ఇదంతా అయ్యేదా పెట్టేదా" అనే అనుమానం ఎక్కువైంది. సమస్యల పరిష్కారానికి అనువైన కృషి కొద్దిగానైనా మనస్సులోనైనా తోచకుండా అదేపనిగా అనుమానించడం ఎక్కువైతే వ్యతిరేక కృషి ఎక్కువై తమసుఖానికి తామే చిక్కులు కలిపించడం జరుగుతుంది.

## అసంపూర్ణత

మానవుని అసంపూర్ణత దీనికి కొంతవరకు కారణం. అసంపూర్ణత అంటేకి ఎంత విజ్ఞానం సంపాదించినా ఇంకా తెలుసుకోవలసినవిషయాలుండడం. నీరు పల్లానికి ప్రవహిస్తుందని తెలుసుకుని మెరకప్రాంతాలకు పల్లమునుంచి నీరు ప్రవహించిన తర్వాత అసలు నీరు లేని ప్రాంతాలలో నీరు పుట్టించడం ఎట్లాగనేది సమస్య అయింది. అట్లాగే ప్రజలందరికి వోటింగ్ హక్కు ఇచ్చిన తర్వాత ఈ నోట్లతో అధికారంలోకి వచ్చేవారు ప్రజలకు అన్యాయం చేయకుండా చూడడం ఎట్లాగనేది ప్రశ్న అయింది. ఈవిధంగా సమస్యలు ఒక దశలో ఆగిపోవు. ఒక దశ తర్వాత మరొక దశవస్తుంది. క్రమక్రమంగా ఎదుర్కొంటున్న ప్రశ్నలకు పరిష్కారమార్గాలను కనిపెట్టుకుంటూ పోతున్నాం. ఈకృషికి నాంది అసంపూర్ణత. ఇక తెలియవలసిందేమీ లేని దశ అనేది గాని, ఎదుర్కొనే చిక్కులనే వేమీ లేనేలేని దశగాని అసలు ఉండదని గ్రహించాలి.

ఈదృష్టి 19వ శతాబ్దపు జిజ్ఞాసువులకే కలిగింది. ప్రపంచం ఏర్పడడానికి, ఇన్ని చిక్కులు రకరకాలుగా సమాజాన్ని ఎదుర్కొనడానికిఅది కారణాలను కనిపెట్టామన్న తాత్విక సిద్ధాంతాన్ని వారు అవాదేసవాలుచేశారు. అది సరయిన దృక్పథం కాదేమోనన్న జిజ్ఞాస ప్రారంభమైంది. అంతటిలోనే మానవ సంకల్ప కృషికి ఒక రకం స్వేచ్ఛలభించింది. అంటే అంతవరకూ అమలులో ఉంటూ వచ్చిన నమ్మకాలను అనుమానించడం ప్రారంభమైంది. అనాటిలోనే ఈనాటి సాంస్కృతిక, నైతిక ఆదోళనకు బీజాలు ఏర్పడినవి.

దైవంపై నమ్మకంపెట్టి వర్తమాన జగత్తునంతటికీ ఈశ్వరుడే కారణమన్న నమ్మకానికి ప్రాబల్యం తగ్గింది. అయితే ఇట్లా నమ్మటంవల్ల మనశ్శాంతులను, బాధలను కష్ట సముదాయాలలో ఓపికను ఓదార్పు లభించుతుంది. ఇటువంటి ఓదార్పు శాస్త్రవిజ్ఞానం ఇవ్వలేకపోయింది. అంటే దైవనమ్మకం కూడా ఒకరకంగా కార్యకారణ, హేతువాద విజ్ఞానమే. ఈ రకం విజ్ఞానం సరయింది కాదని కార్యకారణ విజ్ఞానమంటే భగవంతుడు కారణం-మిగతదంతా కార్యమని అర్థం కాదని,-మానవ సంకల్పానికి అధిక ప్రాముఖ్యమిచ్చి మానవకృషిని ప్రోత్సహించేదే సరయిన హేతువాదమని 19వ శతాబ్దంలోనే కొంతవరకు గ్రహించారు.

ఈ విధంగా నైతిక, తాత్విక రంగాలలో "దేవుడున్నాడు కనుక మనం చేయవలసిందేమీలేదు. అంతా ఈశ్వర సంకల్పం ప్రకారమే జరుగుతుంది" అనే కారణభావానికి చలామణీ లేకుండా పోయింది. అందువల్ల వచ్చిన వివిధ పరిస్థితులను నైతిక రంగంలో పరిష్కరించేటప్పుడు ప్రపంచానికి ప్రస్తుత బాధల నివారణ కనిపించదు. "కారణమనేది ఈశ్వర జ్ఞానం కాదు. జీవరాసి లక్షణం" అని ఆధునిక విజ్ఞానం నిర్వచించుకున్నది. ఈ ప్రాతిపదికపై రూపొందించే నైతిక విలువలు "ఏగాలికి ఆ గొడుగుపట్టు" "ఏరోటి దగ్గర ఆపాట పాడు" అనేట్టు ఉండవు. ఈ దృక్పథంలో మానవుడు తనంతట తాను నీతిగా వ్యవహరిస్తాడు. ఎవరికో ఆగ్రహం వస్తుందని కాక, ఈశ్వర ప్రేరణ వల్ల కాక, పరిసరాల జ్ఞానంతో స్వయం కృషికి ప్రాధాన్యం గా, ముఖ్యంగా భావించి మానవుడు నీతిగా ఉంటాడు.

కారణము సేదేదో "మహత్తు" కాదు; జీవరాశి లక్షణం. సుఖపడాలని చేసే కృషి కంతకూ ఆధారం - కారణమన్న సిద్ధాంతంవల్ల మానవతా వాదానికి ఇంత కాలంగా ఉంటూ వచ్చిన చిక్కు విడిపోయింది.

"వచ్చిపోయిం తర్వాతనైనా సుఖపడదాం," "వచ్చి ఏమై పుట్టాడో" "ఏ జన్మలో చేసుకున్నాడో" అనే మాటలతో మానవ ప్రవర్తనలోని లోపాలకు సంజాయిషీ చెప్పవలసిన అవసరం లేదు. అవినీతి అనేదానికి సరయిన అర్థం వివరణ చెప్పగలిగిన సమగ్రమయిన తాత్విక సిద్ధాంతం అవినీతికి ఆస్కారం లేకుండా చేయగలదు. అందుకు తగ్గ కృషి వ్యక్తులతో ప్రారంభం కావాలి.

# మధ్య తరగతికి ఉద్యోగాలు

## హైదరాబాదు సభలో సూచన

హైదరాబాదు, ఏప్రిల్ 19:— హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో మధ్యతరగతి ప్రజలలో ని విద్యావంతులకు ఉద్యోగావకాశాలు కల్పించేందుకు మూడు వాణిజ్య సంస్థలను-గృహనిర్మాణ సంస్థ, పరిశ్రమల అభివృద్ధిసంస్థ, వర్తకవ్యాపారస్తులసంస్థ ఏర్పాటుచేయాలని, కాంగ్రెసువారులు కమ్యూనిస్టులు తదితరులు కలిసి జరిపిన బహిరంగ సభలో సూచించారు.

రాష్ట్రంలో ప్రత్యేకించి హైదరాబాదు సికిందరాబాదు నగరాలలో మధ్యతరగతి విద్యావంతులలో నిరుద్యోగం నిర్మూలించడమెట్లా అనే విషయం ఆలోచించేందుకు ఈ సభ ఏర్పాటు చేశారు.

పై మూడు సంస్థలను ప్రభుత్వం శాసనంద్వారా ఏర్పాటుచేయాలని ఈ సభవారు సూచించారు. హైదరాబాదులో పరిశ్రమల అభివృద్ధికి అంతరాయాలుగా ఉన్నవాటి విషయం ముఖ్యంగా విద్యుచ్ఛక్తికి, బొగ్గుకు అధికంగా అవుతున్న ఖర్చు, రవాణా సదుపాయాలు వీటిని దృష్టిలో ఉంచుకొని విచారించేందుకు ప్రవీణులతో ప్రభుత్వం ఒక సంఘాన్ని వేయాలని కోరారు.

ఈ పైన సూచించిన పథకాలను సవివరంగా పరిశీలించి 15 రోజుల్లో నివేదిక అందజేయడానికి ఒక సారథ్య సంఘాన్ని నియమించారు. ఈ సంఘం నివేదిక అందగానే, దానిని ప్రభుత్వానికి పంపుతారు.

# శ్రీ దౌలతానాకే ప్రమాదం

## పాకిస్తానుకు లేదని మంత్రి జబాబు

లాహోర్, ఏప్రిల్ 19: డాక్టర్ ఖాన్ సాహెబ్, పాకిస్తాన్ మూల సిద్ధాంతానికి, ఆ దేశస్థాపకుని ఆశయాలకూ విముఖుడని విందిస్తూ ముస్లింలీగ్ నాయకుడు శ్రీ దౌలతానా నిన్న చేసిన ప్రకటనకు పశ్చిమపాకిస్తాన్ ఆహార వ్యవసాయ శాఖల మంత్రి శ్రీ ఆబిద్ హుస్సేన్ ప్రత్యుత్తరం యిచ్చారు.

శ్రీ హుస్సేన్‌కూడా ముస్లింలీగ్ సభ్యులే. ఆయన తన సమాధానంలో యిలా అన్నారు:

కుప్పకూలిపోయున్న తన రాజకీయ సౌధపుగోడలను, దేశభక్తి అనే అలంకారంతోనూ, నిల్లతోనూ కప్పిపుచ్చటానికి శ్రీ దౌలతానా ప్రయత్నం చేస్తున్నారు.

'పాకిస్తాన్ ప్రమాదంలో ఉన్నది' అని ఆయనవేసే కేకలవల్ల వప్పేమీ ఉండదు. ప్రమాదం పాకిస్తాన్‌కు లేక తన స్వంత హోదాకు శ్రీ దౌలతానా రూఢి చేసుకోవాలి.

దేశభక్తిని తానొక్కడే గుత్తకు పుచ్చుకొన్నానని అసత్యపు ప్రచారం చేసేముందు, తాను దేశానికి ఎంత సేవ చేసిందీ శ్రీ దౌలతానా ఒక్కసారి ఆత్మపరీక్ష చేసుకోవాలి.'

# కమ్యూనిస్టుల్లో కలహాలు

## రాజకీయపంథాపై కలిసిరాని భావాలు

పాల్ఘాట్, ఏప్రిల్ 20: చతుర్థ భారత కమ్యూనిస్టుపక్ష కాంగ్రెసు సమావేశంలో కలహాలు, వాగ్వివాదాలు చెలరేగుతున్నాయి. కాంగ్రెసు సమావేశం ఇవాళ రెండోరోజు. మొత్తం పదిరోజులు జరుగుతుంది.

కేంద్రసంఘం ప్రతిపాదించిన రాజకీయ సిద్ధాంత తీర్మానానికి ప్రతినిధులనేకమంది అనేక సవరణలు ప్రతిపాదించినట్లు కేంద్రసంఘ సభ్యుడొకడు తెలియజేశాడు. కొందరు వేరే తీర్మానాలు ప్రవేశపెట్టారు. ఈతీర్మానాల్ని ప్రతిపాదించవచ్చునా కూడదా అనే విషయంపై కోపాలుకూడా రేచ్చాయి. అందువల్ల ఈవిషయం నిర్ణయించడానికి తొమ్మిదిమంది సభ్యులతో ఒక సారథ్యసంఘాన్ని నియమించారు.

ఈసమావేశానికి పశ్చిమబెంగాలులో ఎన్నికవిషయాలేవో ఉన్నందువల్ల శ్రీమతి అరుణ ఆసఫాలీ మరికొందరు బెంగాల్ ప్రతినిధులు రాలేదు.

ఇవాళ సమావేశంలో ప్రతినిధులు అభ్యుదయకరమైన పాలనా విధానాలు సాధించడంకోసం విస్తృత ప్రజోద్యమం సాగించవలసిన అవసరం ఉందని నొక్కి చెప్పారట.

మన దేశ ఆర్థిక వ్యవస్థలో, సాంఘిక, పరిపాలనా యంత్రాంగంలో మార్పులు తెచ్చి నూతన విధానాలను అమలు జరపడానికి నూతన ప్రభుత్వాన్ని స్థాపించవలసిన అవసరాన్ని ఈ సమావేశం నిరూపిస్తుందని ఒక కేంద్ర సంఘ సభ్యుడు చెప్పాడు. కార్మికులలో రాజకీయ చైతన్యం తెచ్చి, శాంతి, పౌరస్వాతంత్ర్యాలు, కర్షకుల హక్కులను సాధించడానికి పెద్ద ఎత్తున ప్రజోద్యమం నడపడానికి కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం నిర్ణయిస్తుందని చెప్పారు.

మధ్యతరగతి ఉద్యోగుల వృత్తి రక్షణ వేతనాది సమస్యలలో కమ్యూనిస్టుపార్టీ వారికి తోడ్పడుతుందని చెప్పారు.

# విద్యుచ్ఛక్తి రైళ్ల పెట్టెల తయారీ

## జపాన్ భారతకంపెనీల ఒప్పందం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: కలకత్తాలోని ఒక భారతసంస్థకు ఒకజపాన్‌సంస్థ విద్యుచ్ఛక్తిరైళ్ల పెట్టెలు నిర్మించగలదని తెలియజేసిందని, దీనికి భారత సంస్థ సమ్మతించిందనీ లోక్ సభలో రైల్వేల ఉపమంత్రి శ్రీ అలగేశన్ తెలియజేశారు. అయితే నిర్మాణం ప్రారంభం కావడానికి కొంతవ్యవధి పట్టవచ్చును. అంతవరకూ కలకత్తాలో విద్యుచ్ఛక్తి రైళ్లను ఏర్పాటుచేసిన తరువాత ఈ పెట్టెలు జపాన్‌నుంచి దిగుమతి చేసుకోవలసి ఉంటుందని చెప్పారు.

## డీసెల్ ఇంజన్ల తయారీ

చిత్తరంజన్ రైలు ఇంజన్ల కర్మాగారంలో డీసెల్ ఇంజన్లను నిర్మించే విషయం ప్రభుత్వం ఆలోచిస్తోందని కూడా శ్రీ అలగేశన్ చెప్పారు.

# రైల్వే అంచనాల సంఘ సిఫార్సులు

## అమలు వివరణ తెలియజెప్పాలని హితవు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: అంచనాల సంఘం రైల్వేల ఖర్చులపై తను నివేదికలలో చేసిన సిఫార్సులను ఎంతవరకు, ఏవిధంగా అమలుపరుస్తున్నదీ, అప్పుడప్పుడు పార్లమెంటుకు తెలియజేస్తూ వుండవలసిందిగా సభాపతి శ్రీ అనంతశయనం అయ్యంగారు నేడు రైల్వే మంత్రిని హెచ్చరించారు.

రైల్వేశాఖ ఉపమంత్రి అందుకు తల వూపారు.

ఇంతకుముందు డా॥ గిద్వానీ వేసిన ప్రశ్నలకు సమాధానం ఇస్తూ మూడో తరగతి పెట్టెలలో సమశీతోష్ణం ఏర్పాటు చేస్తే నే గాని, ఆ తరగతి పెట్టెల్లో ఉక్కపోయకుండా చేయడం దుమ్ము రేగకుండా చేయడం అసాధ్యమని శ్రీ అలగేశన్ చెప్పారు.

ఈ సమస్య రైల్వే పరిశోధన కేంద్ర ఆలోచనలో వున్నదని గూడా ఆయన తెలియజేశారు,

ఇతర ప్రశ్నలకు సమాధానం ఇస్తూ శ్రీ అలగేశన్ ఈ విధంగా చెప్పారు: ప్రస్తుతం మూడు పెద్ద నలువ రైళ్లు నిర్మాణంలో వున్నాయి. వీటిని అక్టోబరు నుంచి నడిపించాలని ఆలోచిస్తున్నాము. కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాల్లో నడిచే శివార్ల బళ్లలో జనసమ్మర్దాన్ని గూర్చి పరిశీలిస్తున్న సంఘం తమ నివేదిక గతవారంలోనే ప్రభుత్వానికి సమర్పించారు. ఇతర దేశాలనుంచి తెప్పించిన రైలు పెట్టెల్లో తగు ఏర్పాట్లు చేయవలసి వున్నందువల్ల వాటిని ఉపయోగంలోకి తీసుకురావడంలో కొంత ఆలస్యం అవుతున్నది. ఆ ఏర్పాట్లను కొన్నింటిలో పూర్తిచేసి ఉపయోగంలోకి తెచ్చాము. తక్కినవాటిని గూడా త్వరలోనే వాడకంలో పెడ్తాము.

# అమెరికా-చైనాల 44 వ సమావేశం

జనీవా, ఏప్రిల్ 19: ఫార్మోజా ప్రాంతంలో బలాల ఉపసంహరణకు సంబంధించిన సూత్రంపై ఒక నిర్ణయం చేసేందుకు అమెరికా, చైనా దేశాల ప్రతినిధులు యిక్కడ మళ్లీ కలుసుకున్నారు. అయితే నిర్ణయంమాత్రం జరగలేదు. ఈరీతిగా సమావేశం కావటానికి యిది 44 వ సారి.

# భద్రాద్రిలో కలరా

## ఇద్దరుయాత్రికులమరణం

కొత్తగూడెం, ఏప్రిల్ 21: శ్రీరామనవమి ఉత్సవాలకు భద్రాచలం వెళ్ళి, యిళ్ళకు తిరిగిపోతున్న యాత్రికులలో యిద్దరు కలరా వలన మరణించారు. ఒకరు గుమ్మూరు వద్ద, యింకొకరు యిక్కడ యీ వ్యాధికి బలియైనారు.

# పూలిచెర్లలో 144 సెక్షన్

రాయదుర్గం, ఏప్రిల్ 20: పార్టీ గ్రామమైన పూలిచెర్లలో దేవర ఉత్సవం సందర్భమున కొట్లాటలు జరుగునని తెలిసి రాయదుర్గం డివిజనల్ వారు శ్రీ గురునాథాచార్యులు పుభయ పార్టీలపైన 144 సెక్షన్ జారీచేసి దేవర ఉత్సవం ఆపివేశారు. పైగా రిజర్వు పోలీసుకూడా గ్రామంలో గస్తీ తిరుగుతున్నారు. (స్వ. వి.)

